# మతం మత్తు

సారమత్తుకే లోక మేడ్సి చస్తావుంటే
మతం మత్తును గలిపిరి - అందులో
మనిషి నెత్తురు నింపిరీ
మల మలా మాడేటి మనిషి కడుపులోని
మానవత్వము గూల్చిరి - దానిలో
మట్టి పెల్లలు పేర్చిరి
కండ్లల్లో మిగిలిన కారుణ్యం జూసి
కాకులోలె పొడిసిరి - లోకాన్ని
చీకటి చేసేసిరి
కండల్ని కరిగించి మసీదు గుడులను
కట్టినా కూలన్నల - గుండెల్ని
రెండుగా జీల్చేసిరి
మనసుతో కొలిసేటి మత విశ్వాసాన్ని
రాజకీయం జేసిరి - మతాన్ని
రాజ్యానికి మూడిపెట్టిరి
అన్నమో రామన్న ఆకలి తమ్మున్ని
శూలానికి దిగ బోడ్సిరి- సూటిగా
ఢిల్లి దిక్కే నడిసిరి
చెదిరిపోయిన ప్రజల బ్రతుకును చెరబట్టి
రాజ్యమూ సమ్యాదెను - సర్కారు
క్రూరమై చెలరేగేను
కత్తులకు కరువండ్ల ఎరగ మమ్మ జేసి
కాటికి మేం బోతుమా - వాళ్ళ
ఆటలకీ బలి యవుదుమా
సారకెదురూ నిల్సి దండు గట్టిన మేము
నెత్తురుకు దడి గట్టమా - దొరల
జిత్తులను పసిగట్టమా
బతుకొక్కటై ఉంది బా దొక్కటై ఉంది
ఉన్నోని దొక్క మతము - మాపటికి
లేనోని దొక్క మతము
కూల్చింది ఎవర్ని కూలోన్ని పేదోన్ని
ఈ పాలకుల గుంపంతరా - వాల్ల
తరుముదాం గూతుపెట్టరా

— మిత్ర

# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాస పత్రిక

సంపుటి : 17   సంచిక : 2

సెప్టెంబరు 1993 141

ప్రజాసాహితి కార్యాలయం :
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావు పేట,
విజయవాడ - 520 002.

రచనలు పంపవలసిన చిరునామా :
**నిర్మలానంద,**
వర్కింగ్ ఎడిటర్, ప్రజాసాహితి
7-23, తమిళ్ స్ట్రీట్
చినవాల్తేరు,
విశాఖపట్నం - 530023

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :
**కొత్తపల్లి రవిబాబు,**
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268.
గుంటూరుజిల్లా




ముఖచిత్రం :

'[illegible] దొరగారూ! మీకు శ్రమ దేనికి[illegible] అందర్నీ, అన్నిట్నీ కట్టి తీసుకొస్తాంగా!'.

— పి. వి.

(డంకెల్ కివ్యతిరేకంగా అఖిల భారత రైతు కూలీ సంఘాల సదస్సు కోసం పంజాబ్‌లో రూపొందించిన పోస్టరు.)

రెండవ కవరు పేజీ :

విత్తం మత్తు (పాట)

— మిత్ర

మూడవ పేజీ :

ఇప్పుడైనా మేలుకో (కవిత)

— నిశితాసి

నాల్గవ పేజీ :

బెంగాల్ కరవు (పాట)

— సుంకర

**ఈ సంచిక వెల. రు. 5-00**

వెల : రూ. 5   సం॥ చందా రూ. 50
ప్రత్యేక సం॥ చందా రు. 100
(సం॥లో ప్రచురించిన పుస్తకాలతో)
డి. డి. లు మేనేజర్, ప్రజాసాహితి
విజయవాడ-2 పేరుతో పంపాలి.

## ఈ సంచికలో...


సంపాదకీయం— 3

డంకెల్ ముసాయిదా నేపథ్యం (ప్రసంగ వ్యాసం)
— డా॥ బాలగోపాల్ 6

విశ్వ నాటక రంగం -గురజాడ
— డా॥ కతెవరపు వెంకట్రామయ్య 9

పదును (కవిత) — జూపల్లి ప్రేమ్‌చంద్ 25

సంకీర్ణ పాత్ర గిరీశం — డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి 29

అంకురార్పణ (కవిత) — చల్లా రామఫణి 38

సావిత్రి సాహిత్య జీవితం-సమీక్ష
(పుస్తక సమీక్ష) — కాత్యాయినీ విద్యహే 40

ఇప్పుడైనా మేలుకో (కవిత) — నిశితాసి 45

ప్రశ్నించే తరం (కథ) — కాలువ మల్లయ్య 46

స్వీకారం 56

డంకెల్ మా కొద్దురో (పాట) — ఎ. చలపతి 57

పిల్లల ప్రపంచం-నిర్వహణ : — పి. చంద్రశేఖర్ అజాద్ 58

యిప్పుడూ- నా చిన్నప్పుడు! — నటరాజ్ 59

సామాజిక స్పృహగల నటుడు ఉత్పల్‌దత్ (సంస్మరణ)
— ధా॥ ప్రభాత్ 61

రాయలసీమ సమస్యలపై ఎన్‌సైక్లోపీడియా (సమీక్ష)
— కొత్తపల్లి రవిబాబు 67

నిజాయితీ లేని వాక్యం (కవిత)
— శీలా వీర్రాజు 67

చైతన్య వాహిని 70

## సంపాదకీయం

# సామ్రాజ్యవాదం - మతోన్మాదం

63 సంవత్సరాల నాటి కొన్ని సంఘటనలూ, నేటి పరిణామాలూ పోల్చుకుంటే మన దేశం నడక ఎటువైపు సాగుతుందో స్పష్టమవుతుంది.

ఆనాటి బ్రిటీషు సామ్రాజ్యవాదులు భారతీయులందరికీ నిత్యావసరమైన ఉప్పుపై పన్ను విధించిన దానికి నిరసనగా, శాసనోల్లంఘనం చేసిన లక్షలాది భారతీయులు రక్తాలు కారేలా లాఠీ దెబ్బలు తిని, జైళ్ళ పాలయ్యారు. ఉప్పు సత్యాగ్రహ, శాసనోల్లంఘనకూ, స్వాతంత్ర్య పోరాటానికీ నాయకత్వం వహించమని ప్రగల్భాలు చెప్పుకునే వారి అధినాయకుడైన 'మహాత్మ' గాంధీకి నిజమైన వారసులమని చాటుకునే కాంగ్రెసు పార్టీ పాలకులు గుజరాత్‌లోని కాండ్లా రేవు పట్టణ ప్రాంతంలో సుమారు 16,000 ఎకరాల భూమిని ఉప్పు పండించుకోమని అమెరికన్ సామ్రాజ్యవాదుల 'జల రాక్షస' (OCTOPUS) కంపెనీ కార్గెల్‌కు ఈనాడు లీజుకిచ్చారు.

ఆనాడు ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ నాయకత్వాన పెషావర్ (ఈ నాటి పాకిస్తాన్) ప్రాంతంలో శాసనోల్లంఘనం సాగిస్తున్న ముస్లిం ప్రజానీకంపై బ్రిటీషు పాలకులు కాల్పులు జరపమని ఆదేశించినా ఘర్వాలీ (హిందూ) సైనికులు అందుకు నిరాకరించి జైళ్ళ పాలయ్యారు. తీవ్రమైన చిత్రహింసలకు గురయ్యారు. మరి నేడో....

గత రెండు మూడు సంవత్సరాలుగా అద్వానీ రథ యాత్రకు ముందూ తర్వాతా- బాబ్రీ మసీదు కూల్చివేసిన తర్వాత జరిగిన అనేక మతోన్మాదపు దాడులలో స్వయంగా సైనికులూ, పోలీసులే పాల్గొని ముస్లిం ప్రజల్ని ఊచకోత కోసిన సంఘటనలు వెలుగులో కొచ్చాయి. బొంబాయి నగరంలో అవి స్పష్టంగా బయట పడ్డాయి. ఇందిరా గాంధీ హత్యా (31-10-84) నంతరం దేశ రాజధాని ఢిల్లీ నగరంలో సిక్కు ప్రజానీకంపై జరిగిన ఘోర హత్యాకాండలో పోలీసు యంత్రాంగం పాల్గొన్నట్టు ప్రభుత్వ విచారణ కమిటీలే నిర్ధారించాయి.

అలా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటమూ చైతన్యాల స్థానే సంపూర్ణమైన లొంగుబాటు తనమూ; హిందూ - ముస్లిం సోదరతత్వం స్థానంలో శత్రుపూరిత

విద్వేషమూ చోటు చేసుకున్నాయి. 46 సం॥ల కాంగ్రెసు పరిపాలన ఫలితంగా రూపు దిద్దుకున్న పరిస్థితి యిదీ!

బ్రిటీషు వారి అడుగుజాడల్లో నడిచే దళారీ స్వభావపు పరిపాలన దుష్ఫలితాలు ఇంకోలా ఎలా వుంటాయి ?

తరతరాల భారత చరిత్రలో ఎన్ని ఒడుదుడుకులున్నప్పటికీ, అనేక మతాల, జాతుల, తెగల జీవనంలో భిన్నత్వం ఉన్నప్పటికీ.... అందులోనే ఐక్యత కూడా అంతర్లీనంగా అవరించుకొని వస్తోంది. బ్రిటీషు సామ్రాజ్యవాద పరిపాలకులు అత్యాధునిక 'స్పృహ'తో భారతీయుల్లో మతతత్వ భావనలకు నీరు పోసి పెంచారు. ఒక దశలో (1857 ప్రాంతంలో) ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులను రెచ్చగొట్టి బాబ్రీ మసీదు వివాదాన్ని సృష్టించారు. ఈ శతాబ్దపు ప్రారంభంలో (1906) 'ముస్లిం లీగు' ఏర్పడటాన్ని ప్రోత్సహించటం, వారికి ప్రత్యేక ప్రాముఖ్యత నిస్తున్నట్టు నటిస్తూనే ముస్లిములను బ్రిటీషు సామ్రాజ్యవాదాల దళారీలైన నాయకుల కింద సమీకరింపబడేట్టు చూసి అంతిమంగా దేశం రెండు ముక్కలయేట్టు చేశారు. అందుకు కాంగ్రెసు నాయకుల కుటిల రాజకీయాలు, హిందూ మతోన్మాద సంస్థల విద్వేష కార్యకలాపాలూ ప్రత్యక్షంగానూ, పరోక్షంగాను దోహద పడ్డాయి.

కాంగ్రెసు పరిపాలకులు ఒక వైపు సామ్రాజ్య వాదులకు లొంగి వుంటూనే మరో వైపు తమ దుష్ట రాజకీయ ప్రయోజనాల కోసం మతమూ, కులమూ, ప్రాంతమూ, భాషా, జాతి.... భేదాలను వాడుకుంటూ, ఎప్పుడేది అవసరమైతే దాన్ని రెచ్చగొట్టి తుదకు తీర్పు చెప్పే పాత్రను పోషిస్తున్నాయి. ఆర్థిక, రాజకీయ సంక్షోభం పరిష్కరించలేని కోవకు చేరినప్పుడల్లా పై ఆయుధాలతో ప్రజలను చీల్చి దోపిడీ వర్గాల పాలకులను కాపాడుతూ వస్తున్నారు. ఈ క్రమంలో హిందూ మతోన్మాదం పెరిగి, ఫాసిస్టు శక్తిలా అవిర్భవించింది. చారిత్రక కట్టడం బాబ్రీ మసీదును కూలదోసి దేశమంతటా మత విద్వేష భావనల్ని రెచ్చగొడ్తోంది. చరిత్రను వక్ర భాష్యాలు చెప్పి నిచ్చెన మెట్ల బ్రాహ్మణ సంస్కృతినే హిందూ సంస్కృతిగా - అదే - భారతీయ సంస్కృతిగా ప్రజలందరూ విధిగా గుర్తించి పాటించాలని ఆదేశిస్తోంది. కాదన్న వారిపైన ఆగ్రహిస్తోంది.

పై మతోన్మాద వాతావరణం వ్యాప్తి చెందుతూండిన కాలంలోనే అమెరికన్ సామ్రాజ్య వాదులు పెద్ద ఎత్తున భారత దేశంలో చొరబడి ప్రపంచ బ్యాంకు అప్పులు, ఐ. యం. ఎఫ్ షరతులతో- చివరికి దుర్మార్గమైన డంకెల్ ప్రతిపాదనల పేరుతో భారతదేశాన్ని మరోసారి వలసగా మార్చే ప్రయత్నం చేస్తున్నారు.

3½ లక్షల కోట్ల రూ॥ల విదేశీ అప్పుతో, నూతన పారిశ్రామిక విధానం పేరుతో సరళీకృత ఆర్థిక విధానాల సాకుతో భారత దళారీ పాలకులు రోజు రోజుకీ దేశాన్ని సామ్రాజ్యవాదుల పాదాక్రాంతం చేస్తున్నారు. సరిగ్గా ఈ సమయంలోనే హిందూ మతోన్మాదులు ప్రజల్ని చీల్చి సామ్రాజ్యవాదాన్ని గూర్చి ఆలోచించనివ్వకుండా, భారతీయుల్ని ఐక్యం కానివ్వకుండా చూస్తున్నారు.

ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో తీవ్రమైన సంక్షోభం, దానితో పాటు ప్రపంచ వ్యాపితంగా, ప్రత్యేకించి మూడవ ప్రపంచ దేశాలలో తీవ్రరూపం దాల్చుతున్న వర్గపోరాటాల అభివృదిని అడ్డుకొనటం కోసం ప్రపంచ వ్యాపితంగా దోపిడీ పాలక వర్గాలు పునరుద్ధరణ వాదాన్నీ, మతోన్మాదాన్నీ పెంచుతున్నాయి. ఇందులో భాగంగానే మనదేశంలో అణగారిన కులాలకీ, అణగారిన వర్గాలకు కూడా చెందిన మెజారిటీ ప్రజలపై హిందూ మతోన్మాదం దాడి ఎక్కు పెట్టబడింది. కుల వ్యవస్థ హిందూ మతోన్మాదానికి పునాదిగా వున్నది. కుల సమస్య వర్గ సమస్యలో అంతర్భాగం అన్న అవగాహన వుండి తీరాలి. ఈ అవగాహనతో సాగించే తీవ్రమైన పోరాటాలతో మాత్రమే కార్మికులు, వ్యవసాయ కూలీలు, రైతులు, మహిళలు, దళితులు నిజమైన దేశభక్తి గల; లౌకిక, ప్రజాస్వామ్య సంస్కృతిని వాంఛించే శక్తులన్నిటికీ, మెజారిటీ ప్రజలందరికీ సవాలుగా నిలిచిన హిందూ మతోన్మాదాన్ని, సామ్రాజ్యవాదాన్నీ ఎదుర్కొన గలుగుతాము.

మతోన్మాదం, సామ్రాజ్యవాదాల ఈ దుర్మార్గపు పాత్రను ఎండగట్టడమే కాకుండా వాటికి వ్యతిరేకంగా మెజారిటీ సాధారణ ప్రజలను ఐక్యం చేస్తూ, ముందుండి పోరాడాల్సిన కర్తవ్యం భారత కార్మిక వర్గంపై వుంది.

భారత విప్లవ కార్మిక వర్గం తన చారిత్రక కర్తవ్యాన్ని నెరవేర్చటంలో భాగంగా ఈ సెప్టెంబరు ('93) నెలాఖరున లక్నో పట్టణంలో మతోన్మాదానికీ, సామ్రాజ్యవాదానికీ వ్యతిరేకంగా ఒక సదస్సుని నిర్వహిస్తోంది. వివిధ అంశాలను చర్చించి, భవిష్యత్ కార్యక్రమాన్ని కార్మిక వర్గానికీ, విశాల ప్రజానీకానికి అందివ్వబోతోంది.

పై సభలు విజయవంతం కావాలనీ, అందులో రచయితలూ - కళాకారులూ కూడా పాల్గొని తగు విధంగా స్ఫూర్తిని పొందాలని 'ప్రజాసాహితి' ఆశిస్తోంది.

ప్రజాసాహితి

!పసంగ వ్యాసం *

# డంకెల్ ముసాయిదా నేపథ్యం

— డా॥ బాలగోపాల్

ఈ సదస్సులో ప్రారంభోపన్యాసం ఇచ్చే అవకాశం నా కిచ్చినందుకు ధన్య వాదాలు. డంకెల్ ప్రతిపాదనలపై సదస్సు కనుక - వాటి గురించి వివిధ కోణాలలో చాలా మంది మాట్లాడతారు. కనుక నేను దీని నేపథ్యం గురించి చెప్తాను.

మూడవ ప్రపంచ దేశాలపై నానాటికీ సామ్రాజ్యవాద ఆధిపత్యం తీవ్రతర మౌతోంది. గత 12, 13 సంవత్సరాలుగా ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ తీవ్రమైన సంక్షోభంలో వుంది. ఈ రెండు అంశాలూ గమనంలో వుంచుకోవాలి. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రతి 30, లేక 40, లేక 50 ఏళ్ళ కొకసారి సంక్షోభానికి గురౌతూనే వుంటుంది. ఉత్పత్తి చేసిన సరుకులు అమ్ముకోడానికి వారికి మార్కెట్ దొరకదు. పెట్టుబడిని మదుపు పెట్టడానికి అవకాశాలు లభించవు. ఇది పెట్టుబడిదారీ సమాజంలో పదే పదే పునరావృతమయ్యే సంక్షోభం. 1980 నుంచీ అటువంటి సంక్షోభం ఒకటి ప్రారంభమైంది. ఈ సంక్షోభం బలానికి గుర్తు కాదు - బలహీనతకు గుర్తు.

మూడవ ప్రపంచ దేశాలపై ప్రపంచ బ్యాంకు, ఐ. ఎమ్. ఎఫ్. సంస్థలు అనుసరిస్తున్న దూకుడు విధానాలను (aggressive) మనం గమనించాలి. 1930లో అంటే 60 ఏళ్ళ క్రితం పెట్టుబడిదారీ వ్యవస్థ తీవ్రమైన సంక్షోభాన్ని చవి చూసింది. దారుణమైన నిరుద్యోగ పరిస్థితి ఏర్పడింది. పరిశ్రమలు మూతపడ్డాయి. కంపెనీలు దివాళా తీసాయి. ఫలితంగా తీవ్రమైన సామాజిక, రాజకీయ సంక్షోభం ఏర్పడింది. అదే విధంగా మరల ఈనాడు ప్రపంచ పెట్టుబడిదారీ విధానం తీవ్రమైన సంక్షోభంలో వుంది. 1930 నాటి సంక్షోభం ఎంత తీవ్రమైనదో ఇదీ అంతే తీవ్రమైనది. అయితే ఒక తేడా వుంది. 1930 నుండి ఈనాటి వరకు - అంటే గత 60 సంవత్సరాల కాలంలో పెట్టుబడిదారీ విధానం ఈ సంక్షోభాన్ని తట్టుకోవడం నేర్చుకుంది. 1930 లలో రెండవ ప్రపంచ యుద్ధం పెట్టుబడిదారీ విధానాన్ని కాపాడింది. యుద్ధం అంటే ఎక్కువ డిమాండ్. చాలా మంది సైన్యంలో చేరారు. కొత్త సాంకేతిక వస్తువులు, ఆయుధాలు కనుగొనబడ్డారు. అది పెట్టుబడిదారీ విధానాన్ని తాత్కాలి కంగా కొద్ది కాలం రక్షించింది. యుద్ధం తర్వాత, యుద్ధ సమయంలో విచ్ఛిన్నమైన ఆర్థిక విధానాన్ని పునర్నిర్మించడం కోసం యూరప్‌లో కృషి జరిగింది. ఇది కూడా మదుపు పెట్టడానికీ, పెట్టుబడి విస్తరణకూ బాగా అవకాశాలను సృష్టించింది.

---

* జలంధర్‌లో -17-8-93

ఇది గాక రెండు అగ్రరాజ్యాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం కొనసాగుతోంది. ఈ రెండు అగ్రరాజ్యాలు మూడవ ప్రపంచ దేశాలకు ఆయుధాలను సరఫరా చేసి వారిలో వారు యుద్ధం చేసుకొనేట్లు చేసి, తద్వారా తమకు మార్కెట్లును సృష్టించుకున్నారు. వీటన్నిటి కన్నా మరో ముఖ్యమైన పరిణామం ఏమిటంటే 1960 నుంచి సాంకేతికంగా అవరోధాలను అధిగమించడం ఇది దాదాపు రెండవ పారిశ్రామిక విప్లవంగా పిలువబడ్తోంది. ఎలక్ట్రానిక్స్, కంప్యూటర్లు - కమ్యూనికేషన్ (సమాచార రంగం) రంగాల్లో అతి తక్కువ కాలంలో అత్యంత అద్భుతమైన అభివృద్ధి ఈ కాలంలో చూశాం. ఇది పెట్టుబడిదారీ విధానం అతి త్వరగా విస్తరించడానికి దోహద పడింది. కొన్నేళ్ళ క్రితం మనం గోర్బచేవ్ ప్రవేశపెట్టిన పెరిస్త్రోయికా గురించి విన్నాం. ఆయన చెప్పిన వాటిలో ఒక అంశం ఏమిటంటే సోవియట్ రష్యా, పశ్చిమ దేశాలతో సమానంగా ఆర్థిక రంగంలో చాలా కాలం వుంది. కాని ఎలక్ట్రానిక్ కమ్యూనికేషన్ విప్లవం రాగానే సోవియట్ వెనకబడి పోయింది. ఆ వెనకబాటు తనం (gap) క్రమ క్రమంగా పెరుగుతూ పోయింది. కనుక పశ్చిమ దేశాలతో సరితూగలేక పోయింది. అంతిమంగా దాని ఫలితం అనుభవించారు. ఎలక్ట్రానిక్, కమ్యూనికేషన్ విప్లవం పెట్టుబడిదారీ దేశాలకు మార్కెట్లను పునరుద్ధరించడంలోనూ, పెట్టుబడిదారీ విధానం వ్యాపించడానికి, మదుపు పెట్టడానికి విస్తృత అవకాశాలను కల్పించడంలోనూ సహాయ పడింది. కాని 1980లో అంటే ఒక దశాబ్దం క్రితం ఈ విస్తరణ తరాజా కుంటుపడింది. అంటే దాని అర్థం సాంకేతిక అభివృద్ధి నేడు లేదు అని కాదు. కాని అభివృద్ధికి అవసరమైన వేగం, విస్తరిస్తున్న మార్కెట్లనూ, మదుపు అవకాశాలనూ, ఇంకా పెట్టుబడిని అభివృద్ధి చేయడానికి తగిన వేగం లేదు. పెట్టుబడిదారీ విధానంతో వచ్చే చిక్కేమిటంటే, అది ఎన్ని సరికొత్త విభాగాలను సృష్టించినా, పెట్టుబడి కొరకు అది సృష్టించే ఆకలి ఆ దశను దాటి పోతుంది. ఆ తర్వాత ఈ నవీనకరణ దశ కొనసాగుతుండి- కాని పెట్టుబడి కోసం వేసే ఆకలి, ఎంత పెరిగి పోతుందంటే, అది మార్కెట్ సంక్షోభాన్ని, పెట్టుబడిదారీ విధానాలలో ఆర్థిక, సామాజిక సంక్షోభాన్ని సృష్టిస్తుంది. గత ఇరవై ఏళ్ళుగా ఈ సంక్షోభం కొనసాగుతోంది. అయితే ఒక దశాబ్దం నుంచీ ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య సంస్థ (ఐ.ఎం.ఎఫ్.), ఇప్పుడు సరికొత్తగా గాట్ (GATT) [illegible] ఒత్తిడం ప్రదర్శిస్తున్నాయి. వాటి లక్ష్యం ఎక్కువెక్కువగా మార్కెట్ కావాలి. ఎక్కువ ఎక్కువగా మదుపు అవకాశాలు కావాలి. ఎందుకు ? పశ్చిమ దేశాల పెట్టుబడిపై మరింత గుత్తాధిపత్యం(monopoly) సృష్టించుకోడానికీ, మూడవ ప్రపంచ మార్కెట్ పైనా, తక్కువ అభివృద్ధి చెందిన దేశాల మార్కెట్

పైనా గుత్తాధిపత్యాన్ని పొందడానికి ఈ దూకుడుతనం ప్రదర్శిస్తున్నాయి. దీనిలో భాగమే డంకెల్ ముసాయిదా.

ఈ సదస్సు నిర్వాహకులు సూచించినట్లుగా ఐఎంఎఫ్ చేత, ప్రపంచ బ్యాంకు చేత మూడవ ప్రపంచ ఆర్థిక విధానాల్లో ప్రోత్సహింపబడుతున్న మార్పులూ డంకెల్ ముసాయిదా వేర్వేరు విషయాలు కావు. డంకెల్ ముసాయిదాలోని కొన్ని ప్రతిపాదనలు, ఐ.ఎం.ఎఫ్ ప్రతిపాదనలలో కలిసివుంటాయి. ఉదాహరణకు మూడవ ప్రపంచ దేశాల మార్కెట్‌లోకి బహుళ జాతి కార్పొరేషన్ల పెట్టుబడి స్వేచ్ఛగా ప్రవేశించడం, ఎగుమతులకు అన్ని రకాల టారిఫ్ అడ్డంకులను తొలగించడం. కేవలం ఒకే ఒక అడ్డంకి వుంటుంది. అది కస్టమ్స్ అడ్డంకి. ఇక ఏ ఇతర అడ్డంకీ వుండకూడదు. డంకెల్ ప్రతిపాదనలు, IMF షరతుల్లో భాగమే. మూడవ ప్రపంచ దేశాలకు ప్రపంచ బ్యాంకు ఇచ్చే సలహాలు కూడా దీనిలో భాగమే. ఈ రెండూ పరస్పరం పెనవేసుకొని వున్నాయి.

డంకెల్ ప్రతిపాదనల్లో కొత్తదనం ఏముంది? కొత్తదనం, వ్యవసాయానికీ, పశుపోషణకూ సంబంధించిన ప్రతిపాదనల్లో వుంది. ఇక మిగిలినవన్నీ పాక్షికంగా ఐ.ఎమ్.ఎఫ్. పట్టు పట్టే షరతులే-ప్రపంచ బ్యాంకు ఎప్పటి నుంచో వీటి గురించి పట్టు పడ్తోంది. రెండవ ప్రపంచ యుద్ధం చివర్లో సృష్టింపబడిన ఈ సంస్థలూ, నిజానికి బహుళ జాతి పెట్టుబడి ద్వారా మూడవ ప్రపంచదేశాలపై ఆధిపత్య సాధనకు సాధనాలుగా పనిచేయలేదు. అవి వేరే మార్గాన్ని ఎన్నుకున్నాయి. రెండవ ప్రపంచ యుద్ధం చివర్లో పెట్టుబడిదారీ దేశాలన్నీ ఒక విషయాన్ని గుర్తించాయి. అదేమిటంటే అంతర్జాతీయ స్థాయిలో ఏకాభిప్రాయం ద్వారా పరిష్కారం చేసుకోవాల్సిన సమస్యలు పెట్టుబడిదారీ విధానంలో వున్నాయని. ఒకవైపు పెట్టుబడిదారీ విధానం ప్రపంచ వ్యాప్తంగా వుంది. మరోవైపు ఎవరి ప్రయోజనాలకు లోబడి వారి పెట్టుబడిదారీ విధానం వుంది. ఈ రెండింటి మధ్య కొన్ని ఘర్షణలూ కొన్ని వైరుధ్యాలు వున్నాయి. ఒక పెట్టుబడిదారీ దేశంలో మదుపు పెట్టడానికి వనరులు లేకపోవడమనేది మొత్తం పెట్టుబడిదారీ ఆర్థిక విధానంపై ప్రభావితం చూపిస్తుంది. కనుక ఒక రకమైన బ్యాంకు అవసరం. ఈ బ్యాంకు పునర్నిర్మాణానికీ, అభివృద్ధికీ అప్పులు ఇస్తుంది. ఈ బ్యాంకుకు ప్రపంచ బ్యాంకు అని పేరు పెట్టారు.

(సశేషం)

అనువాదం :

— డా॥ కిరణ్మయి



# విశ్వ నాటక రంగం - గురజాడ

— డా॥ కె తెవరపు వెంకట్రామయ్య

"గురజాడ భారతదేశంలోను, ప్రపంచంలోను ఉన్న ఉత్తమ నాటక రచయితలలో ఒకడే కాదు, ఆయన ఒక విప్లవకవి కూడా."

— శ్రీశ్రీ

పూర్వరంగం :

'ఆంధ్ర నాటకరంగం విశ్వ నాటకరంగానికిచ్చిన కానుక 'కన్యాశుల్కం.' ఒక గొప్ప మేధావి యొక్క రచన[1] అని ప్రశంసించబడిన ఈ కన్యాశుల్క నాటకం 'నిజంగా జీవితమంత విశాలం. అంతకు రెండింతలు సహజం.' (It is really as large as life and twice natural. [2]) ఈ నాటక కర్త ఆధునికాంధ్ర సాహితీ పైతాళికుడు గురజాడ (వెంకట) అప్పారావు.

1892 ఆగష్టు 24 (17 ?) లో తొలిసారి 'జగన్నాధ విలాసినీ సభ' వారిచే విజయనగరంలో ప్రదర్శింపబడిన కన్యాశుల్క రచనాకాలం ప్రదర్శనానికి కొద్ది కాలం ముందయి వుంటుంది. తొలి ప్రదర్శన పూర్తిగా విజయవంతమైంది. 1892 ఆగష్టు 26వ తారీఖున- ఆ ప్రదర్శనాన్ని సమీక్షిస్తూ- "మన స్థానిక నాటక సమాజం వారిచే గత శనివారం రాత్రి కన్యాశుల్కమనే స్వతంత్ర నాటకం హృదయంగమంగా ప్రదర్శింపబడింది" అని ఆ రోజుల్లో విజయనగరం నుంచి వెలువడుతుండే 'తెలుగుహార్ప్' పత్రిక రాసింది.[3] (ఆ నెల్లో 13వ తారీఖునాడు కన్యాశుల్కానికి సంస్కృతంలో ముదుంబై నరసింహాచార్యులు గారు నాందీ ప్రస్తావనలు రాసినట్లు దాఖలా లున్నాయి. ఆ తర్వాత 17, 24 తేదీల్లో మాత్రమే - 26వ తేదీకి ముందు శనివారాలు వచ్చాయి.) "గత శనివారం" అన్నారు కాబట్టి కన్యాశుల్క తొలి ప్రదర్శన 24-8-'92 అని నిర్ధారించవచ్చు. అంటే కన్యాశుల్క తొలి ప్రదర్శన జరిగి నేటికి నూరేళ్ళన్న మాట. (ఈ వ్యాసం రచించినది ఆగస్టు 1992లో)

కానీ తొలి ప్రదర్శన ఐదేళ్ళకి- అంటే 1897లో గాని కన్యాశుల్కం ముద్రితం కాలేదు. ఈ ప్రతినే 'తొలి కన్యాశుల్కం' అంటున్నాం.[4] మొదటి

కూర్పును ఆంధ్ర పాఠకలోకం బాగా ఆదరించింది. పత్రికలు 'రివ్యూ' ల్లో ప్రశం సించాయి.[5]

"కన్యాశుల్కం అందరూ చదవవలసిన పుస్తకం. చాలా హాయిగా చదువు కోవచ్చు. మేము దాదాపు విడువకుండా ఒకే విడతలో చదివాము. కాని, సహజమైన సంభాషణలు, కథావిష్కరణ నైపుణ్యం వున్నా, అవి దాని విశిష్ట గుణాల్లో ముఖ్య మైనవికావు. ఈ నాటకం మానవ ప్రవృత్తికి అద్దం పడుతోంది. కన్యాశుల్కం కథ అదీ అన్న మాట. భారతీయ శీలంలోని బహుముఖాలను చిత్రించడానికి ఇది ఎంత అవకాశమిచ్చిందో ప్రత్యేకించి చెప్పవలసిన అవసరం లేదు. శ్రీ అప్పారావు ఈ అవకాశాలను వృథా చేయలేదు— ది వీక్లీ రివ్యూ, 1897 మార్చి 27.

"కన్యాశుల్కం చదవదగిన పుస్తకమని మా పాఠకులందరికీ చెప్పడానికి మేమెంతో సంతోషిస్తున్నాము. దీనిలోని పాత్రచిత్రణ ధైర్యోపేతమైంది. మొత్తం నాటకానికి ఒక చక్కని సమగ్రత ఉంది. దాని నిర్మాణం కళాత్మకంగా ఉంది. ఇవన్నీ రచయిత ఉపజ్ఞను, నాటక రచనా ప్రావీణ్యాన్ని ప్రస్ఫుటం చేస్తున్నాయి." ది పీపుల్స్ ఫ్రెండ్, 1897 జనవరి, 21.

"ఈ నాటకంలోని ప్రధాన రసం హాస్యం. ఈ పుస్తకాన్ని జాగ్రత్తగా చదివితే పాఠకుని మనసులో సమాజ సంస్కరణ అవసరమన్న యథార్థం నాటుకుంటుంది-" చింతామణి. మొత్తం మీద తొలి కూర్పు ప్రచురణ- తెలుగు సాహిత్యంలో ఒక అపూర్వ సంఘటనగా పత్రికలు కొనియాడాయి. సమకాలిక విమర్శకుల ఆదరాభి మానాల్ని ఇంతగా చూరగొన్న కన్యాశుల్క ప్రతులు కొన్ని వారాల్లోనే అమ్ముడ వడం పెద్ద విశేషమేమీ కాదు. "The first edition was a marked success. The press gave it a cordial reception and hailed it as an event is the History of Telugu Literature ... The first edition was exhausted in a few weeks and there has since been a constant demand for copies." అని గురజాడ మలి కూర్పు పీఠికలో రాసుకున్న మాటలు నాటక ప్రతులన్నీ అమ్ముడైపోయినా- ప్రతులు కావాలని వత్తిడి వస్తున్నా- మరో 12 సం॥ల దాకా రెండో ముద్రణను చేయలేక పోయాడు. దానికి కారణాల్ని ఆయనే ఇలా చెప్పాడు : "నా నాటకానికింతటి విజయం చేకూరి నప్పటికీ మళ్ళీ దాన్ని ముద్రించాలని కానీ, లేదా కొత్తవి రచించి అచ్చు వేయించాలని కాని అప్పట్లో అనుకోలేదు. అందుకు కారణాలు రెండు. తెలుగున గ్రంథ ప్రచురణ మనేది పేకులాట పంచాంగం. కృత్యాద్యవస్థ. మూరపులోనో లేదా కనీసం బెంగాలులోనో వున్నట్లు తెలుగుదేశంలో పుస్తక వ్యాపారమనేది లేదు. గ్రంథకర్త తన పుస్తకాన్ని

తానే అచ్చొత్తించుకోవాలి. ముద్రాపకుడు, ప్రకటనకర్త, ప్రచురణకర్త అన్నీ అతనే అచ్చొత్తించిన పుస్తకాన్ని అభినందనలతో బహూకరించమని ఏ పరిచయస్థులైన మర్యాదస్థులు గ్రంథకర్తను అర్థిస్తారు దీనితో గ్రంథకర్త లాభం గూటిల్లోకి వస్తుంది. అతని పని కుదేలు.

"అప్పట్లో నా నాటకాన్ని పునర్ముద్రించక పోవడానికి, కొత్తవి రాసి ప్రచురించక పోవడానికి మీద చెప్పిన పరిస్థితి ఒక కారణం. రచయితల కోవలోనికి చేరాలని ఆనాడు నేను కాంక్షించకపోవడం రెండవ కారణం."[6] రచయితల కోవలో చేరడం ఇష్టం లేదన్న గురజాడ- మిత్రుల ప్రోత్సాహ ప్రోద్బలాలతో, ముఖ్యంగా- శ్రీనివాసయ్యంగారి సలహాతో కన్యాశుల్కాన్ని 'పునస్సృష్టి' చేసి ముద్రించక తప్పలేదు. అది 1909 మేలో జరిగింది.

ఉత్సాహం, ఉద్వేగం పొంగులు వారే కాలంలో- ముప్పై సంవత్సరాల వయసులో- నాటక సాహిత్యంలో నవ్యతను సృష్టించాలనే కుతూహలం తొందర పెడుతున్న కాలంలో సమాజంలో జరగుతున్న కాలంలో, సమాజంలో జరుగుతున్న దురాచారాలను సహించలేక "Such a scandalous state of things in a disgrace to society" అనే ఆవేశంతో రచించిన నాటకం తొలి కూర్పు. "I wrote it to advance the cause of social reform and to combat a popular prajudice that the Telugu language was unsuited to the stage." సంఘ సంస్కరణోద్యమాన్ని ముందుకు నడిపించడం, నాటక రచనకు వ్యావహారిక భాష నప్పదనే అభిప్రాయాన్ని పూర్వ పక్షం చేయడం- తొలి కూర్పు నాటి గురజాడ రచనకు ప్రేరణలు. ఉత్సాహ, ఉద్వేగాల పొంగు చల్లారి, నలభై య్యేడు సంవత్సరాల జీవితానుభవంతో నిరంతరం- పఠనాశక్తి, పరిశీలనా దృష్టితో పదును వారిన మేధస్సుతో, సంయమనం, గాంభీర్యం, స్పష్టత, నమ్రత అలవడి: సాహిత్య శిల్పంలో పరిణతితో పాటు హేతువాదం, మానవతావాదం, సృజనాత్మక వాస్తవికత బాగా వొంటబట్టిన తర్వాత వెలువడిన నాటకం కన్యాశుల్కం మలి కూర్పు.[7] దీనితో- రచయితల కోవలో చేరడమే ఇష్టంలేని గురజాడ- విశ్వ రచయితల ప్రక్కన సగర్వంగా నిలబడగలిగాడు.

## సమకాలీన ఆంధ్ర నాటకరంగం :

"గట్టు దాటి, పుట్ట దాటి, ఘనమైన అడవి దాటి" అన్నట్లు కురవంజి, జక్కుల కథ, యక్షగానం, వీధి నాటకం, తోలు బొమ్మలాట వంటి జానపద రీతులను దాటి సునిర్దిష్ట సాహిత్య ప్రక్రియగా తెలుగులో నాటకం రూపొందింది 19వ శతాబ్దం ఉత్తరార్థంలో. 1880 - 84 ప్రాంతాల్లో - తెలుగు జిల్లాలలో ధార్వాడ్, పార్శీ

నాటక సమాజాలు నాటకాలు ఆడడం వల్ల కలిగిన ఉత్తేజం; ఇంగ్లీషు సాహిత్యా ధ్యయనం వల్ల ఆ భాషలోని నాటకాలవలెనే తెలుగులో కూడా నాటక రచన చేయాలనే ఆకాంక్ష- తెలుగులో నాటక రచనారంభానికి దోహదం చేశాయి.

మరాఠీ నాటక సమాజాలు తెలుగునాట ఆడిన నాటకాల ప్రభావంవల్ల చెమ్కీ-దుస్తులకు, అసహజమైన కొట్లాటాలకు, కర్ణకఠోరమైన సంగీతానికి మన తొలి నాటకాలలో స్థానం లభించింది. క్రమంగా హిందీ నాటకాల ప్రదర్శన తగ్గినా, తెలుగులో మంచి నాటకాలు- రచనా శిల్పంతో- ప్రదర్శనా దృష్టితో రచింపబడ్డవి తొలి నాళ్ళలో అరుదే. గురజాడ పోషకుడు - ఆనంద గజపతి ఆస్థానంలో 'జగన్నాథ విలాసినీ సభ' అనే ఒక నాటక సంస్థ ఉండేది. ఈ సంస్థ తరచూ ఆంగ్ల, సంస్కృత నాటకాలు ప్రదర్శించేది. 1889 నవంబరులో ఈ సమాజం కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలం' ప్రదర్శించినట్లు గురజాడ డైరీలను బట్టి తెలుస్తుంది. ఆ నట దాన్ని గురజాడ చూశాడు. ప్రదర్శనకు అనువైన పద్ధతిలో నాటకం ఎలా రచించాలో ప్రణాళిక సిద్ధం చేసుకున్నాడు. విజయనగరం మహారాజా కళాశాల లెక్చరర్‌గా అప్పటికే చాల యేళ్ళ నుంచి షేక్స్పియర్ నాటకాలూ, యెలిజబెత్ కాలానికి చెందిన ఇతర రచయితల నాటకాలూ బోధిస్తూ వున్నాడు. ఆయా నాటకకర్తల రచనా శిల్పం గురజాడలో జీర్ణించుపోయింది. ఆనంద గజపతి— తన సంస్థాన పరిధిలో మూడేళ్ళలో జరిగిన కన్యాశుల్క వివాహాల వివరాలు సేకరించాడు. మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో బిల్లు ప్రవేశపెట్టి- చట్ట రూపంగా ఆ దురాచారాన్ని రూపుమాపటానికి ప్రయత్నించాడు. కానీ దేశీయుల అవరోధం వల్ల బిల్లు వీగిపోయింది. ఆనంద గజపతి కన్యాశుల్క దురాచారాన్ని రూపుమాపే నాటకం రాయమని ప్రోత్సహించాడు. ఒక సాంఘిక సమస్యను తీసికొని, ప్రజల భాషలో- రంగస్థల ప్రదర్శనకు అనుగుణంగా- సజీవపాత్ర నిర్మాణంతో- మానవతా విలువల్తో గురజాడ కన్యాశుల్క నాటకం 1892 నాటికి రచించాడు.

గురజాడ కన్యాశుల్కం రచించే నాటికి తెలుగులో వెలువడ్డ 'నాటకాల జాబితా'ను పరిశీలిస్తే, తన సమకాలిక నాటక రచయితల కంటె గురజాడ దృష్టి ఎంత విశాలమైందో మనకి అవగత మౌతుంది. కన్యాశుల్కం ఎందువల్ల గొప్ప నాటకం అయిందో కరతలామలక మౌతుంది.

1872 — నరకాసుర విజయవ్యాయోగం — కొక్కొండ వారి అనువాదం.
1875 — అభిజ్ఞాన శాకుంతలం — కందుకూరి అనువాదం-
(రెండంకాలు)
— పరవస్తు వేంకటరంగాచార్యులు
అనువాదం (రెండంకాలు)

1875 (6) — సీజరు చరిత్ర (పద్యనాటకం) — వావిలాల వాసుదేవశాస్త్రి (అను)
1880 — నందక రాజ్యం ( " ) — " -స్వతంత్రనాటకం
— బ్రాహ్మ వివాహము — కందుకూరి- స్వతంత్ర రచన-ప్రహసనం.
— రత్నావళి — " అనువాదము.
— వెనీసు వర్తక చరిత్రం — " "
— వివేక దీపిక (స్త్రీ పునర్వివాహ సమస్య) — " స్వతంత్రరచన.
— వ్యవహార ధర్మబోధిని (ప్లీడర్ల అవినీతిని చిత్రించేది) — " "
— వెనీసు వణిజ నాటకం — గురజాడ శ్రీరామమూర్తి అను.
1881 — ఉత్తర రామ చరిత్ర — వావిలాల వాసుదేవశాస్త్రి అను.
1883 — అభిజ్ఞాన శాకుంతలం — కందుకూరి అను సంపూర్ణం.
— అహల్యా సంక్రందన నాటకం — నాదెళ్ళ పురుషోత్తమకవి.
1885 — ప్రహ్లాద — " స్వతంత్రం, పౌరాణికం.
— దక్షిణ గోగ్రహణం — " స్వతంత్రం, పౌరాణికం.
— ప్రబోధ చంద్రోదయం — " అనువాదం.
— మాళవికాగ్ని మిత్రం — " "
1886 — రాగ మంజరి (షెరిషడ్-ది డ్యూ యెన్నా) — " అనువాదం.
— వేణీ సంహారం — వడ్డాది సుబ్బరాయ కవి అను.
— సత్య హరిశ్చంద్ర — కందుకూరి -స్వతంత్రం-పౌరాణికం.
1887 — విషాద సారంగధర — ధర్మవరం కృష్ణమాచార్యులు.
— తిర్యగ్విద్వన్మహాసభ (89?) — కందుకూరి-ప్రహసనం
— పాండవ అజ్ఞాతవాసం — సుసర్ల ఆనందరావు.
1888 — హాస్య సంజీవని (ప్రథమ భాగం) — కందుకూరి 19 ప్రహసనాల-సంకలనం.
1889 — మహారణ్య పురాధిపత్యం — కందుకూరి -ప్రహసనం.
— విక్రమోర్వశీయం — వ.సు. రాయకవి అనువాదం.
1890 — నాగానందం — పాలెపు సూర్య ప్రధాని అను
— ప్రియదర్శిని — పాడి వేంకటశాస్త్రి అను.

1890 — హరిశ్చంద్ర నాటకం — నాదెండ్ల పురుషోత్తమకవి—
'పాత్రోచిత ప్రసంగ వచన సమనిత్వం'.

1891 — ఉన్మత్త రాఘవం — కోరాడ రామచంద్రశాస్త్రి అను.
— ధర్మాంగద నాటకం — జి. శ్రీనివాసశాస్త్రి.
— నాగానందం — వేదం వేంకటరాయశాస్త్రి అను.
'పాత్రోచిత భాషాప్రయోగం గల రచన.'
— మృచ్ఛకటికం — వావిలాల వాసుదేవశాస్త్రి అను.

- హాస్య సంజీవని (ద్వితీయభాగం) - వీరేశలింగంగారి [17] ప్రహసనాల సంకలనం.

గురజాడకు పూర్వం సాంఘిక సమస్యల్ని ఇతివృత్తాలుగ గ్రహించింది ఒక్క వీరేశలింగంగారే. ఆయన బ్రాహ్మ వివాహం (పెద్దయ్యగారి పెండ్లి పుస్తకం) కన్యాశుల్క సమస్యని; వ్యవహార ధర్మబోధిని (ప్లీడరు నాటకం) - న్యాయ వ్యవస్థ లోని భ్రష్టతను, వివేకదీపిక - స్త్రీ పునర్వివాహ సమస్యను చిత్రించినవి. కందుకూరి ప్రహసనాలు అధిక భాగం సమకాలిక సాంఘిక సమస్యలకు అద్దం పట్టినవే! ఇక భాషా విషయంలో కూడా కందుకూరి మాత్రమే వీలైనంత వరకు సజీవ భాషను వాడాడు. వేదం వారు నాగానందం నాటకంలో నీచ పాత్రలకు గ్రామ్యాన్ని వాడారు. మిగిలిన నాటకాలన్నీ పౌరాణికశైలీ విలసితాలే! అంతేకాదు పద్యమయాలు. ఆ నాటకాలన్నీ మూసలో పోసి తీసినట్లు ఒకే విధమైనవి. సాహిత్యాని కంటే సంగీతానికి వీటిలో ఎక్కువ ప్రాధాన్యం ఉండేది. ఈ స్థితిలో ఒక ఉన్నత లక్ష్యాన్ని నిర్దేశించి గురజాడ కన్యాశుల్కాన్ని సృష్టించాడు. "Itenerant Maratha troupes staged Hindi plays in the Telugu Distrits and made money. Local companies copied their example and audience listened with delight to what they did not understand. The bli s of ignorence could not have been more forcibly illustrated. KANYASULKAM gave little scope to vulgar stage attractions such as flaring cos'umes, senuous dances, bad music and sham fights: yet it drew crowded houses and vindicated the claims of the vernacular. ....I am glad to find that Hindi plays are on the decline. But the conditions of the Telugu stage can by no means be considered satisfactory....Thare are not many good plays..Modern life which presents complex social conditions is neglected by play- wrights except for purpose of broadest farce, and poverty

సాంఘిక సమస్యా చిత్రణ, వ్యావహారిక భాషా ప్రయోగం - ఈ రెండు అంశాల్లో కందుకూరి గురజాడ సమీపానికొచ్చినా; నాటక శిల్పంలో గురజాడదే అగ్రస్థానం. ధర్మవరం కృష్ణమాచార్యులు, వేదం వెంకటరాయశాస్త్రి, వావిలాల వాసుదేవశాస్త్రి, మొదలైన గురజాడ సమకాలికులలో గురజాడది కాలం కంటే ముందుచూపు. కాబట్టే తొలి ప్రదర్శన, ప్రచురణ పత్రికాలోక ప్రశంసల్ని దండిగా చూరగొన్నాయి.

గురజాడ కన్యాశుల్కాన్ని పునస్సృష్టించే నాటికి కూడా ఆంధ్ర నాటక రచయితలలో చెప్పుకోదగ్గ పరిణామం ఏదీ కనబడదు. కన్యాశుల్కం తొలి ముద్రణ (1897) - మలిముద్రణ (1909) ల మధ్య వెలువడిన నాటకాలివి:

1898 — కన్యకావిజయం — రామానుజ సూరి.
1899 — ఇంద్రసభానాటకం — సీతారామకవి
రంగశాయి కదనసమవాకారం — కాళ్ళకూరి సాంబశివరావు
పార్వతీ పరిణయం — సి. వీరబ్రహ్మం.
మాలతీ మాధవం — తిరుపతి వెంకటకవులు.
1900 అనర్ఘరాఘవం — అకొండి వ్యాసమూర్తి
కమలినీ కలహంస నాటిక — పాలెపు వెంకటసూర్యగోపాల ప్రధాని. (అనువాదం)
— పూలగుర్త నరసింహామాత్యుడు(")
నర్మదాపురుకాత్సీయము — కొండముది నరసింహం.
1901 — అపవాదతరంగిణి — K.V.R. కృష్ణారావు. అను.
— రంభానలకూబర విలాసం — కృష్ణమాచార్యులు
రసిక్య సాంబవిలాసం — విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యశర్మ
1902 — ఉన్మత్త రాఘవం తాడూరి లక్ష్మీనరసింహం (అను)
కస్తూరితిలక — సూరి పూర్ణానంద శర్మ
మాలతీ మాధవం — జనమంచి వెంకటరామయ్య.
1903 — మల్లికామారుతం — వడ్డాది సుబ్బరాయకవి.
1904 — సారంగధర — నాగినేని వెంకటప్పయ్య.
1905 — సారంగధర — పానుగంటి లక్ష్మీనరసింహారావు.
ప్రద్యుమ్నానందనాటకం — ద్వివేది బ్రహ్మానందశాస్త్రి

| | | |
|---|---|---|
| 1906 — | సారంగధర | — జయంతీ భావనారాయణ. |
| | భిజ్ఞాన శాకుంతలం | — వడ్డాది సుబ్బరాయకవి. |
| | | — ముదిగొండ మల్లి కార్జునశర్మ. |
| 1907 | సారంగధర | — విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యశర్మ |
| | — చారుమతీ నందవర్ధనీయము | — నండూరి వెంకటరమణయ్య. |
| | — అద్భుత సుందరి లేక జంఝూమారుతం | — పరమహంస విద్యానందస్వామి అనువాదం. |
| | — జయచంద్ర రేఖావిజయము | — అయినాపురపు సుందరరామయ్య. |
| | — శ్రీరామరాజ్య వియోగము | — మల్లాది అచ్యుతరాయశాస్త్రి. |
| | — రసతరంగిణి (సంగీత) | — దాసు నారాయణరావు. |
| | — పాండవాశ్వమేధం | — తిరుపతి వేంకటకవులు |
| | పాంచాలీ పరిణయం | — కొండముది నరసింహం. |
| 1908 | వసుమతి | — ఆచంట సాంఖ్యాయనశర్మ అను. |
| | పాదుకాపట్టాభిషేకము | — దాసు నారాయణరావు. |
| | పాండవ ప్రవాసం | — తిరుపతి వెంకటకవులు |
| | కన్యకాపరమేశ్వరీ విలాసం | — కొళ్ళూరి సాంబశివరావు. |
| | చంద్రమతీపరిణయం | — దుగ్గి గోపాలకృష్ణారావు. |
| | చిత్రాభ్యుదయం | — కొళ్ళూరి నారాయణరావు. |
| | తారాశశాంకము | — ఓలేటి పార్వతీశ్వరకవి. |
| | త్రిలోకసుందరి | — కొత్తపల్లి సూర్యారావు (అను). |

తొలి కన్యాశుల్కానికి ముందు అనువాద నాటకాలెక్కువ. మలి కన్యాశుల్క కాలానికి స్వతంత్ర నాటకాలెక్కువయ్యాయి. అయినా వానిలో మున్ప్రాతిక మున్వీసం పౌరాణికాలే. ఎక్కువ పద్య నాటకాలే. ఈ నాటకాల్లో ఏవీ నేటికి ప్రదర్శనలో లేవు. కనీసం పఠన స్థాయిలో కూడా లేవు. అలాంటిది కాలం తాకిడికి నిలబడి 'నూరేళ్ళ పండగ' జరుపుకోవడం ఇంట గెలవడం కదా! సమకాలీన ఆంధ్ర నాటక కర్తల లోపాలే గురజాడ కన్యాశుల్క సార్వకాలికతకు వరాలు. తెలుగు నాటక కర్తలలో గురజాడ అగ్రేసరుడు. కన్యాశుల్కం 'ఏకమేవాఽ ద్వితీయం.'

## భారతీయ నాటకరంగం- గురజాడ

సంస్కృత నాటకరంగ చరిత్ర ఇంచుమించు 2 వేల సంవత్సరాలను మించింది. సంస్కృత నాటకాలలో గురజాడను తొలిగా ఆకర్షించింది కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం. ఈ నాటకాన్ని ఎంత నిశితంగా పరిశీలించాడో, ఆయన

డైరీలు నిరూపిస్తాయి. ఓ వైపు దుష్యంత పాత్ర చిత్రణలోని అనౌచిత్యాల్ని విమర్శిస్తూనే మరోవంక రచనలోని సొగసుల్ని శ్లాఘిస్తాడు. తన అసంపూర్ణ నాటకం బిల్హణీయంలో ఇలా అన్పిస్తాడు. "కవి అంటే ఎవడు. వస్తు ప్రపంచం నందు ఇతరులు చూడలేని సొగసులు చూసేవాడు. ఇతరులకు అవేద్యమైన రసమును అనుభవించేవాడు. కాళిదాసుని ఈ విషయంలో ఎంతైనా మెచ్చవలసి వున్నది. ప్రియురాలు దొంగతనంగా ప్రియుడి వెనుకపాటున వచ్చేటప్పుడు, ఆమె అందెల యొక్క అణగీ అణగని చడి సొగసును కవులలోకెల్లా కాళిదాసు కదా గ్రహించెను. "గూఢం నూపుర శబ్దమాత్ర మపి మేకాంతం శృతే పాతయేత్"- కవిత్వంలో ధ్వని ఆ అందెల చడిలా వుండాలి." (బిల్హ. రెం. అం.) కాళిదాసులాగానే గురజాడ కూడా వస్తు ప్రపంచంలో ఇతరులు చూడలేని సొగసులు చూశాడు. కల్పనా చమత్కృతిలో కాళిదాసుకు పోటీగా నిలుస్తాడు. కాబట్టే "సంస్కృత వాఙ్మయానికి కాళిదాసూ, ఆంగ్ల వాఙ్మయానికి షేక్స్పియరూ ఎటువంటివారో ఆంధ్ర నాటక వాఙ్మయానికి గురజాడ అటువంటివారు" అని ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు పేర్కొన్నారు. (ది అడ్వర్టయిజర్ : విజయనగరం 1963)

ఇక కన్యాశుల్కం మీద శూద్రకుని మృచ్ఛకటిక నాటక ప్రభావం కూడా ఇతోధికమే. గురజాడే తన డైరీలలో 29 ఏప్రిల్ 1895 సోమవారం నాడు రాసుకున్న "వసంతసేన భోగము పిల్ల · భూమిక అకర్షణీయము" అన్న నోట్సును బట్టీ: కన్యాశుల్కం సప్తమాంకం 6వ స్థలంలో మధురవాణిని గూర్చి సౌజన్యారావుతో కొత్త మనిషి "మృచ్ఛకటికం చదివిందేమోనండీ" అంటే సౌజన్యరావు "వసంత సేనలాంటి మనిషి పెద్ది కవీశ్వర కల్పనలో ఉండాలిగాని లోకంలో ఉండదు" అన్న దాన్నిబట్టి గురజాడ మధురవాణిని వసంతసేనను దృష్టిలో పెట్టుకొని చిత్రించినట్లు స్పష్టమౌతుంది. మృచ్ఛకటికం సాంఘిక దృక్పథము, సామాజిక స్పృహ ఉన్న గొప్ప నాటకం. కన్యాశుల్కం కూడా ఆ కోవలోదే! "మహాకావ్యమనిపించుకున్న గ్రంథాలు ఏ దేశంలోనైనా కొద్దిగానే ఉంటాయి. అటువంటి వాటిలో భారతదేశంలో మృచ్ఛకటికంతో బాటు ఒక్క కన్యాశుల్కాన్నే ఎన్నిక చేస్తాను" అని శ్రీశ్రీ కితాబు.

భవభూతి 'మాలతీ మాధవం'లో 'మాయా మాలతి పెళ్ళి'ఘట్టమొకటి వుంది. మాలతీ మాధవం 'ప్రకరణ' మనే రూపక భేదం. కన్యాశుల్కంలోని 'మాయసుబ్బి' పెళ్ళి 'మాయ మాలతి పెళ్ళి'ని పోలిందే! మాలతీ మాధవం(8వ శతాబ్ది) ఆ నాటిక సాంఘిక నాటకమే. కన్యల్ని అనురూపవయస్కులైన వరుల కివ్వాలేగాని వయస్సు మళ్ళినవారికి ఇవ్వగూడదన్న మానవత్వ తత్త్వమే ఈ 'మాయా మాలతి'

వివాహఘట్టానికి ప్రాతిపదిక. కన్యాశుల్కంలోని మాయ సుబ్బి పెళ్ళి ఘట్ట తత్త్వం కూడా ఇదే కదా!

విజయనగరం మహారాజా కళాశాలలో లెక్చరర్‌గా పని చేసిన అప్పారావు గారు బోధించిన వాటిలో ఆంగ్లం, గ్రీకు చరిత్ర, రోమన్ చరిత్రలతో పాటు సంస్కృతం కూడా వుంది. గురజాడ సంస్కృత భాషా ప్రావీణ్యానికి అంశం చాలు. ఆయన సంస్కృత నాటకాల్ని జీర్ణంగా చదివారు రకరకాల ఆహారపదార్థాలు ఆరోగ్యవంతుని శరీరంలో ప్రవేశించి రక్తంగా మాంసంగా ఏ విధంగా పుష్టిని కలుగ చేస్తాయో గురజాడ మీద ఆయన చదివిన ఆ ప్రాచీన నాటకాల ప్రభావం ప్రసరించినా, అది అనుకరణ కాదు. ప్రతిభా దారిద్ర్యం కాదు. ఒక మహోన్నత రచనకు ధాతువులు మాత్రమే!

కాగా సమకాలిక భారతీయ నాటక రంగంలో గురజాడను ఆకర్షించినవి వంగ, కన్నడ, తమిళ నాటకరంగాలు. బెంగాల్‌లో రూపక దశ ప్రారంభం 1795లో. అది 1835 నాటికి కాని ఒక రూపాన్ని సంతరించుకోలేదు. ప్రసన్న కుమార్ ఠాకూర్, అతని స్నేహితులు 'హిందూ థియేటర్' అనే పేరుతో ఒక సంస్థను స్థాపించి షేక్స్పియర్ 'జూలియస్ సీజర్'; భవభూతి 'మహావీర చరిత్ర'కి హెచ్. హెచ్. విల్సన్ చేసిన ఆంగ్లానువాదం ప్రదర్శించారు. దాంతో ఆంగ్ల నాటకాల ప్రదర్శన ప్రారంభమైంది. క్రమేపి ఆంగ్ల, సంస్కృత నాటకాను వాదాలు ప్రదర్శింప బడ్డాయి. స్వకపోల కల్పితాలనదగ్గ నాటకాలు 1852లో గాని వెలుపడలేదు. తారా శరణ్ శిరదార్ 'భద్రార్జున్' పాశ్చాత్య పద్ధతిని అనుసరించిన తొలి గద్య పద్యాత్మక నాటకం. రామ్ నారాయణ్ తర్కరత్న (1822-1886) వ్రాసిన 'కులీన్ కుల సర్వస్వ' 1854లో అచ్చయింది. బ్రాహ్మణులలో అగ్రగణ్యులయిన కులీనులు సమాజ దృష్ట్యా ఎంత వెనుకబడి వున్నారో చిత్రించబడింది. నిజానికి ఇది నాటకం కాదు. సంఘంలోని లోపాలన్నీ ఒకదాని తరువాత ఒకటి చిత్రించిన రేఖాకృతుల సమీకరణ. 1866లో 'తర్కరత్న' ప్రచురించిన 'నవ నాటక్' ఇంకా విశిష్టమైంది. ఈయనే 1867లో వ్రాసిన (?) 'సంబంధ సమాధి' బహు భార్యత్వాన్ని, బాల్య వివాహాల్ని ఖండించిన రచన. ఈ కాలంలోనే వితంతు వివాహం మీద పదుల కొద్దీ నాటకాలు వెలువడ్డాయి. ఉమేశ్ చంద్ర మిత్ర వాసిన 'విధవా వివాహ నాటక్' చెప్పుకోదగింది. ఇది రంగస్థలం మీద రక్తి కట్టిన నాటకం. మైకేల్ మధుసూధన దత్తు 'శర్మిష్ఠ' పద్మావతి చెప్పుకోదగ్గవి. వంగ భాషలో పరినిష్ఠితమైన క్రమబద్ధమైన నాటక రచనకు ప్రయత్నించిన వాడు దత్తు. దత్తు తరువాత వంగ నాటకాన్ని ప్రభావితం చేసినవాడు దీనబంధు మిత్ర. ఇతను వ్రాసిన 'నీలి దర్పణ్' (1860) జెస్సూర్

గ్రామం చుట్టుపట్ల నీలిమందు వ్యాపారంలో అధికారుల మోసాలు, రైతుల కష్టాలు చూచి వ్రాసిన వాస్తవికతా పూర్ణమైన నాటకం. ఉపేంద్రనాథ్ దాసు వంగ రంగ స్థలానికి ఉత్తేజం కలిగించాడు. 'శరత్ సరోజిని' (1874), 'సురేంద్ర వినోదిని' (1875) ఇతని నాటకాలు. దేశభక్తిని ప్రబోధించేవి. గిరీష్ చంద్రఘోష్ (1844-1911) అట్టడుగు వర్గాల జీవితాన్ని చిత్రించాడు. ఎనభై పైచిలుకు నాటకాలు వ్రాశాడు. ఇతనిలాంటి వాడే అమృతలాల్ బోస్ (1853-1929). హాస్య ప్రియు డితడు. మోలియర్ రచనా ప్రభావం ఇతని మీద అధికం. 'కృపణేర్ ధన్' (1900) అలాంటిది. ఈయన రచనల్లో 'వివాహ విభ్రాట్' (1884) విలక్షణమైంది. పాశ్చాత్య సంస్కృతిని సరిగా జీర్ణం చేసుకోని, అర్ధ విద్యావంతులయిన యువ వంగ దేశస్థుల ఆచార వ్యవహారాలు దీన్లో చిత్రితాలు. గురజాడ సమకాలిక వంగనాటక కర్తలు వీరు. అయితే వారందరి కన్నా విలక్షణమైన సమాజంలో ఒక వర్గం జీవిత పార్శ్వాన్ని సమర్థంగా, అత్యంత సూక్ష్మంగా చిత్రించిన గురజాడ, వారి కంటే ఒక అడుగు ముందే వుంటాడనటంలో సందేహం లేదు. గురజాడకు వంగ రచయితల తోను, వారి రచనలతోను వున్న సంబంధాన్ని ఆయన వ్యాసాల సంకలనరిలోని కొన్ని వ్యాసాలు నిరూపిస్తాయి. టాగూర్ ప్రసిద్ధనవల "ఘరె-బైరె" 1912లో వెలువడ్డ వంగ భాషలోని తొలి వ్యావహారిక భాషానవల. గురజాడ కన్యాశుల్కం దానికి ఇరవై యేళ్ళ ముందిది. అంతటి ఆధునికుడు గురజాడ.

గురజాడకు సమకాలీనంలో తమిళ నాటక రంగ పరిస్థితి అంత ప్రోత్సాహ కరంగా లేదు. గురజాడ మద్రాసులో కొందరు తమిళులు ప్రదర్శించిన నాటకాల్ని చూసి, అవి అసహజ, అనౌచిత్య కోష భూయిష్టాలని డైరీలలో వ్రాసుకున్నాడు. రంగస్థలాన్ని దృష్టిలో ఉంచుకొని వ్రాసిన తొలి తమిళ నాటకకర్త పి. సంబంధం మొదలియారు. ఎనభై చిలుకు నాటకాలు వ్రాసిన ఇతడు గురజాడకు సమకాలికుడు. తమిళ నాటక రంగమే కాదు. కన్నడ నాటకరంగం కూడ గురజాడలాంటి రచయి తని పొందలేకపోయింది. 1850 తర్వాత సంస్కృత నాటకానువాదంతో కన్నడ నాటకరంగ చరిత్ర ప్రారంభమయింది. అది 1885లో షేక్స్పియర్ ఆంగ్ల నాటకాను వాదంతో కొంత నూతనత్వాన్ని సంతరించుకొంది. అనువాదానే ఎక్కువగావున్న ఈ కాలంలో కన్నడంలో 1887 లో కర్కిసూరి వెంకట రమణశాస్త్రి (?) గారు "ఇగ్గప్ప హెగ్గడెయ వివాహ ప్రహసనం" -వాడుక భాషతో కన్యా విక్రయం వంటి సామాజిక సమస్యల్ని గూర్చి వ్రాసిన నాటకం. ఆయా ప్రహసన సంభాషణల్లో "వాస్తవికత" నిండుగా వున్న నాటకం.ఇది గురజాడ (వీరి) కన్యాశుల్కానికి ఖచ్చితంగా సమకాలిక మవటం విశేషం.అయితే'నాటక నిర్మాణ శిల్పం'లో మాత్రం ఇది కన్యాశుల్కానికి సాటి వచ్చే రచన కాదు.

గుజరాతీ, ఉర్దూ, హిందీ భాషల్లో గురజాడకు సమకాలికంగా నాటక రచన వున్నా, అవి ప్రాయికంగా అనువాదాలో ! అనుసరణలో ! సంస్కృత, ఆంగ్ల నాటకాల ప్రభావం నీటి మీద అధికం. రచయితల మౌలికత వీటిలో లుప్తం. ఆ రచయితల నాటకాలేవి కన్యాశుల్కంతో తులతూగేవి కావు. ఆయా సాహిత్యాల నాటకరంగాన్ని,రచనల్ని గురజాడతో, కన్యాశుల్కంతో పోల్చి సమగ్రంగా పరిశీలిస్తే గురజాడ ఔన్నత్యం విశదమౌతుంది. సమకాలిక భారతీయ నాటకకర్తలలో నిస్సంహంగా గురజాడదే అగ్రస్థానం.

## విశ్వ నాటక రంగం : గురజాడ

గురజాడకు సమకాలంలోనే యూరప్ ఖండంలో అధునిక నాటక రచనకు బీజాలు పడ్డాయి. యూరప్‌లో- ముఖ్యంగా గ్రేట్ బ్రిటన్‌లో 'ఇబ్సన్'తో అధునిక నాటక రచన ప్రారంభమైంది. ఇబ్సెన్ కంటే ముందే రష్యాలో 1836 నాటికే గోగోల్ 'రివైజర్' (ది గవర్నమెంట్ ఇన్‌స్పెక్టర్) అనే నాటకాన్ని రాశాడు. తుర్జనీవ్ 1850 లో 'ఎమన్స్ ఇన్ ది కంట్రీ' (మెస్యాట్స్ వి డెరెవ్నె): ఓస్ట్రోవ్‌స్కీ 1850 - '70 మధ్య 5,6 సాంఘిక నాటకాలు రాశారు. గొగోల్ రివైజర్ ఆనాటి ప్రభుత్వాధికారులు నైతిక పతకాన్ని చిత్రించే నాటకం. మిగిలినవి సాంఘిక సమస్యల్ని: తీసుకున్నవే; వాస్తవికతను నింపుకొన్నవే. చెకోవ్ (1860- 1904) మనస్తత్వాన్ని నిశితంగా చిత్రించడంలోను పాత్రల భావాల్ని లలితంగా వెల్లడించడంలోను నేర్పరి. ది సీగల్, ది చెర్రీ ఆర్చర్డ్, త్రీ సిస్టర్స్ ఈయన ప్రసిద్ధ నాటకాలు.

ఫ్రాన్సులో డ్యూమాస్ (1824-95) కాల్పనిక నాటక రచనకు నాంది పలికి జనప్రియ నాటకాలు రచించాడు. ఫ్రెంచి అకాడెమీకి సభ్యుడిగా ఎన్నుకోబడినవాడితడు. సార్డోవ్ (1831 - 1908); కోర్టు (1889........) గురజాడకు సమకాలీనులైన, ఫ్రెంచి నాటక రంగాన్ని ప్రభావితం చేసిన నాటకకర్తలు.

స్పెయిన్‌తో ఎచగరె (1832 - 1910) ; బెనీవంటి (1866....) ఇటలీలో పిరాండెల్లో (1867- 1936) ; అమెరికాలో ఓనెల్ (1888....); పోలెండులో విస్పియాన్స్కి (1869 - 1907) ; బెల్జియంలో మేటర్‌లింక్ (1862—1949) జర్మనీలో హాప్ట్‌మన్ (1862 - 46)[8] స్వీడన్‌లో స్ట్రిండ్‌బర్గ్ (1849- 1912): జెకొస్లొవేకియా (1890 - 1938) లు, ఐర్లండ్‌లో సింజ్ (1871 - 1909), బెర్నార్డ్ షా (1856-1950)[9] ఏట్సు (1865 - 1930) గురజాడకు సమకాలికులైన విశ్వనాటక రంగకర్తలు.

అయితే వీరి రచనల్తో గురజాడకు పరిచయం లేకపోవచ్చు. ఇక పరిచయం వున్న నాటకకర్తల్లో మొట్టమొదట పేర్కొనవలసినవాడు ఆంగ్ల నాటకకర్త

షేక్స్పియర్ (1564 - 1616) అన్ని స్థాయిల్లోనూ మృదుమధురంగా, గంభీరంగా, రసభరితంగా భాషాభేదాల్ని ప్రదర్శిస్తూనే - మానవ ప్రకృతిలోని సర్వరహస్యాలు, సమన్వయలు అద్దంలోలా ప్రతిఫలింప చేశాడు తన నాటకాల్లో. హెన్రీ IV - రెండు భాగాల్లోని - ఫాల్‌స్టాఫ్ - గురజాడ గిరీశానికి దగ్గరగా వుంటాడు. కళాశాలలో గురజాడ ఎంతో కాలం ఈ షేక్స్పియర్ నాటకాలు పాఠం చెప్పిన వాడు. తర్వాత విలియం రాబర్ట్‌సన్ (1819-71) వల్ల అప్పారావు ఎంతో ప్రభావితులయ్యారు. 'సొసైటీ'(1865); కాస్ట్ (1867) రాబర్ట్‌సన్ ప్రసిద్ధ నాటకాలు. ప్రేక్షకుల సమస్యలే నాటక ఇతివృత్తాలు. వాళ్ళ భాషలోనే పాత్రలు మాట్లాడుకుంటాయి. 'కాస్ట్' రచనతో రాబర్ట్‌సన్ "ఆధునిక నాటక వైతాళికు" డయ్యాడు. గురజాడ విజయనగరంలో 1897 లో 'కులం' ప్రదర్శన చూసినట్లు ఆయన డైరీలో వుంది. అప్పటికి ముందే ఆయన రాబర్డ్‌సన్ నాటకాలు చదివి వుండాలి. ఇంకా ఆ యన రాబర్ట్‌సన్ వెనువెంటనే నాటకాలు రాసిన యస్. గిల్బర్ట్ (1836-1911),సర్ ఆర్థర్ పినెరో (1855 - 1934), హెన్రీ ఆర్థర్ జోన్స్ (1851- 1929). లాంటి వారి నాటకాలు విమర్శనాత్మక దృష్టిలో చదివినట్లు ఆయన డైరీలవల్ల తెలుస్తుంది. ఆంగ్ల రచయితల్లోనే 'అస్కార్ వైల్డ్' (1854-1900) రచనల్ని గురజాడ చదివాడు. వైల్డ్‌లోని సునిశిత హాస్యం పాత్రపోషణ వైచిత్రి, సాంఘిక ప్రయోజన దృష్టి గురజాడను ఆకట్టుకొన్నాయి. సలోమి, లేడీ విండర్ మీర్స్‌ఫాన్, ఎ వుమెన్ ఆఫ్ నో ఇంపార్టెన్స్ వంటి వైల్డ్ నాటకాలు గురజాడకు పరిచితాలే.

గురజాడను ప్రభావితం చేసిన ఫ్రెంచి నాటకకర్త మోలియర్ (1622—'73)ప్రపంచ హాస్య నాటకకర్తలలో అగ్రగ్రామి అయిన మోలియర్ - కరుణ, హాస్యరసాల సమ్మిశ్రణ రచనలో అనన్యసామాన్యుడు. ఆనాటి ఫ్రెంచి సంఘంలోని లోపాలు, దోషాలు ఎత్తి చూపాడు. దీ స్కూల్‌ఫైవ్స్, దీ డాక్టర్ ఇన్‌స్పైట్ ఆఫ్ హిమ్‌సెల్ఫ్, ఎ స్నెప్రియంగ్ లేడీస్, దీ లెర్నడ్ వుమెన్,దీ ఇమాజినరీ ఇన్‌వాలీడ్ మొ॥ మోలియర్ ప్రసిద్ధ రచనలు. తొలి కన్యాశుల్క నాందిలో ముడుంబై గురజాడ షేక్స్పియర్, బెన్‌జాన్‌సన్, మోలియర్ రచనల్ని నిరంతరం పఠించేవాడని తెలియచేశాడు. గురజాడ పాత్ర చిత్రణా కౌశలంలో మోలియర్ మార్గదర్శకుడు.

ఎలిజబెత్ రాణి కాలపు ఆంగ్ల కవుల్లో షేక్స్పియర్ తర్వాత చెప్పుకోదగ్గ ప్రముఖ నాటకకర్త. సమకాలీన నాటక రచనలోని అసందర్భపు భావుకత, ఇతివృత్త నిర్మాణంలో అశ్రద్ధ, మానవ నైజ చిత్రణంలో అవాస్తవికత, శిల్పసౌష్టవ వస్త్వైక్యాల్లోని లోపాలు బెన్ జాన్‌సన్ నిశిత విమర్శకు గురయ్యాయి. ఆలోపాల్ని

పరిదిద్ది - మానవ మనోవృత్తుల్లో యథార్థంగా తన నాటకాల్లో నిరూపించాడు. 'Theory Human' (మనోవృత్తి సిద్ధాంతం) కల్పించాడు. హాస్య రచనల్లో సిద్ధహస్తుడైన జాన్‌సన్ 'ఎవ్విర్ మాన్ ఇన్ హిజ్ హ్యూమర్', 'ఎవ్విర్‌మాన్ అవుటాఫ్ హిజ్ హ్యూమర్' లాంటి రచనలు చేశాడు. గురజాడ తన సిద్ధాంతానికి పేరు పెట్టకపోయినా జెన్‌జాన్‌సన్ ప్రభావం అతని మీద పుష్కలంగా కనిపిస్తుంది.

గురజాడకు సమకాలికుడు చెప్పుకోదగిన మరో నాటకకర్త ఇబ్సన్ (1828 - 1906). నార్వే దేశానికి చెందిన నాటకకర్త. ఆధునిక నాటక రంగం మీద ఇబ్సెన్ ప్రభావం అత్యధికం నాటక రచనలో వస్తువులోను, పాత్రపోషణ లోను, సంభాషణ విధానంలోను, 'వాస్తవికత'కు ప్రాధాన్యం ఇచ్చాడు. ఇతని పాత్రలు అనునిత్య జీవితంలోని వ్యక్తులు. పిల్లర్స్ ఆఫ్ సొసైటీ (1877), డాల్స్ హౌస్ (1879); ఘోస్ట్ (1891)- వైల్డ్‌డక్, హెడ్డా గాబ్లర్ మొ॥ ఇబ్సెన్ ప్రసిద్ధ నాటకాలు. గురజాడకు ఇబ్సన్ నాటకాల్తో పరిచయ ముందనటానికి ఆయన విజయ నగర సంస్థాన కవి భాగవతుల లక్ష్మీనారాయణ శాస్త్రి 'శ్రీరామ విజయవ్యాయోగ నాటకా'నికి రాసిన పీఠిక (21-12-1894) నిదర్శనం. అలాగే గోమఠం శ్రీనివాసాచారి 'ఆంగ్ల హరిశ్చంద్ర' నాటకానికి వ్రాసిన పీఠిక (1897) లో కూడ ఈ విషయం నిరూపిత మౌతుంది. సంప్రదాయ భాషా శైలిని తిరస్కరించి, సామాన్య జనులు అనునిత్యం వాడే వ్యావహారిక భాషను తన నాటకాల్లో వాడాడు ఇబ్సెన్. "My desire was to depict human beings and therefore I would not make them speak the language of gods" అంటాడు ఇబ్సెన్. కన్యాశుల్క భాషా విషయంలో గురజాడ పూనిక కూడా ఇదే కదా ! వస్తువు, భాషల విషయంలో ఇబ్సెన్ ప్రభావం గురజాడ మీద అధికం.

గురజాడకు అపరిచితులైన, పరిచిత పూర్వులైన సమకాలీన విశ్వనాటక కర్తలు వీరు. అది 'నిర్మాణ సౌష్ఠవం' వుండే నాయకుల యుగం ప్రపంచనాటక కర్తల్లో ఇబ్సెన్, చెహోవ్ ఇద్దరు మాత్రమే తమ నాటకాల నిర్మాణంలో కౌశలం చూపారు. బెర్నార్డ్‌షా రాసిన 'నాటకాభిప్రాయాలు, వ్యాసాలు' అనే సొంతపుస్తకం టైటిల్ పేజీలో గురజాడ రాసుకున్న 'నోట్సు'ను బట్టి గురజాడ నాటక నిర్మాణ శిల్ప దృష్టి తెలుస్తుంది. 'నేను నాటకం రాసేప్పుడు ఏ విధమైన నాటకశాలకైనా తగినట్లు రాస్తాను' అన్న గురజాడలో ప్రధాన లోపంగా విమర్శకులకు కనిపించింది కన్యాశుల్కంలోని కథ (Plot)లో వదులు నిర్మాణమే. (Loose const-

ruction) అయితే దీనికి కారణం షేక్స్పియర్ మొదలైన నాటకకాలానికి చెందిన రచయితల ప్రభావం గురజాడ మీద ప్రసరించటమే. షేక్స్పియర్‌లోని 'Double time scheme' కథా నిర్మాణంలో గురజాడకు ఆదర్శమై వుండవచ్చు. సుబ్బి - లుబ్ధావధాన్ల [illegible] అనబడే ప్రధాన కథ 'Long time' చూపించే వాటి లాంటిదైతే, మధురవాణి- గిరీశాల వృత్తాంతం 'Short time' చూపించే వాటి లాంటిది. ఆ దృష్టితో కన్యాశుల్క ఇతివృత్తం పరిశీలించటం సబబు. కన్యాశుల్కం సమస్యా ప్రదర్శనాత్మక నాటకం. పరిష్కారం నాటక ప్రేక్షకుల ఆలోచనకి సంబంధించిందే! ( dramatist's task is to state what problems are' not to solve them - John Asborson). సమస్యా ప్రదర్శన నాటకం అనటం వల్లే ఇతివృత్తం వైఫల్యాన్ని సంతరించుకొంది. ఎంతగా పెరిగిందంటే 'కన్యాశుల్కం జీవితమంత, విశాలం' అనేంతగా. అంతే కాదు. 'Social Epic play'గా కన్పించేంతగా.

అభిజ్ఞాన శాకుంతలం లాంటి సంస్కృత నాటకాలు: 'మర్చంట్ ఆఫ్ వెనిస్' లాంటి ఆంగ్ల నాటకాలు దేశభాషల్లోకి అనువదింపబడి ప్రదర్శిస్తున్న కాలంలో, "హరిశ్చంద్ర", "నల" వంటి పౌరాణిక పద్య నాటకాలు ప్రాభవం సంపాదిస్తున్న రోజుల్లో సమకాలిక సాంఘిక సమస్యని ఇతివృత్తంగా తీసుకొని ప్రపంచ నాటక కర్తల స్థాయిలో నిలబడే నాటకం రాసిన గురజాడ ప్రతిభా పాండిత్యాలు నిజంగా ఆశ్చర్య జనకాలు. కన్యాశుల్క దురాచారం నశించింది. దీని స్థానంలో నేడు వరశుల్క ముంది. రామచంద్రపురం, కృష్ణరాయపురం వంటి అగ్రహారాలు ఈరోజు లేవు. ఆ జీవితమూ లేదు. అగ్నిహోత్రావధాని, లుబ్ధావధాని వంటి మనుషులూ లేరు. ఆ సమస్యలు, ఆ స్థలాలు, ఆ జీవితం ఇప్పుడు లేనప్పుడు కన్యాశుల్కానికి ఇంతటి స్థానం ఎందుకివ్వాలి ? అనేది ఒక ప్రశ్న. 'దాన్లో చిత్రించబడ్డ మానవ ప్రవృత్తుల్ని బట్టి' అని సమాధానం. ఆ ఒక్క అంశమే గురజాడను ప్రపంచ నాటకకర్తల సరసన సమున్నతంగా కూర్చోపెడుతుంది. "Kanya-Sulkam" remains as amaster'piece in the difficult realim of social satire. It is a glow with life and humanity, its men and women move about with all the graces and kindnesses, oddities, cruelties, chairoscuros, sancities and hypocrisies of real life - a life in which nature and custom, reason and tradition, senti-

ment and superstition are in miserable conflict" - అన్నారు సి. ఆర్. రెడ్డిగారు.[10]

కన్యాశుల్కం అజరామరం. గురజాడ చిరంజీవి. కన్యాశుల్కం ప్రపంచ ప్రసిద్ధ భాషల్లోకి అనువదించ వలసిన ఏకైక తెలుగు నాటకం.

## అ ధ స్సూ చి క లు


1. సోమసుందరాల వెంకట రామమూర్తి, భారతి, సెప్టెం 1940.
2. నార్ల వెంకటేశ్వరరావు - గురజాడ పు. 53 (1979)
3. మొట్టమొదటి కన్యాశుల్కం - బంగోరె పు. 1.0 (1969 లో ప్రకటితం)
4. " - " "
5. అదే - పు 159, 160.
6. గురజాడ లేఖలు - పు. 14, 15.
7. కన్యాశుల్కం తొలి మలి కూర్పుల తులనాత్మక పరిశీలన - నరాల వీరయ్య - పు. 78. (1985)
8. గురజాడ - హాప్ట్‌మన్‌ల తులనాత్మక లక్షణాల్ని అబ్బూరి వివరించారు. చూ. అబ్బూరి సంస్కరణ (నాట్యగోష్ఠి హైదరాబాదు) - (1988)- పు. 384 - 387.
9. గురజాడ - బెర్నార్డు షా తులనాత్మక అధ్యయనం - డా॥ ఎమ్. రాజారావు, హైదరాబాద్ (1991).
10. కన్యాశుల్క - కన్నడానువాదం, పీఠిక.

# పదును

జూపల్లి ప్రేమ్‌చంద్

వరం.... వరం....
రాళ్ళ సీమపై రతనాల వర్షం
పెళపెళార్భాటాలతో ఉరుములు
తళతళార్భాటాలతో మెరుపులు
వెండి ధారలతో నింగికీ నేలకూ సేతువు అమరినట్లు
వర్షం.... వర్షం ... సర్వత్రా హర్షం ...
నెర్రెలిచ్చిన నేలను మెల్ల మెల్లగా గుచ్చుతూ
పగుళ్ళిచ్చిన నేలను పదును చేస్తూ
ఒక్కొక్క చినుకే కురుస్తున్నది సుతారంగా మేను మీద
ఎండను శరీరంతో తాగి తాగి ఎండిపోయిన శరీరం
ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు పులకరించింది, ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు ఒళ్ళు జలద
రించింది
హృదయం దూది పింజెలా మేఘాల్లో విహరించింది
ఎట్టకేలకు పదును అయ్యింది
పలుగూ పారా మడకా కాడీ చేను కాటికి చేరాయి
నేల తల్లి గర్భకుహరాన్ని చీల్చిన విత్తనాలు చేశాయి సూర్య నమస్కారం
కల చెదిరింది ... కథ మారింది....

పల్లెల్లో పల్లె పల్లెల్లో కాయలు కాచిన కళ్ళల్లో పూచాయి కలదంబ పువ్వులు
ఎడారి మొక్కలకు వ్రేల్లాడుతున్నాయి శూన్య దృక్కులు
ఇక్కడ మనుషులు చదరంగం పటం మీది పావులు
భారంగా ఈదుతున్న జీవితాలు, బోదకాలు బతుకులు
హోరు గాలిలో రెపరెప లాడుతున్న దీపాలు
ఆశగా ఆబగా ఆలంబన కోసం అనాదిగా చూపుల పహారాలు కాస్తున్నారు
ఇక్కడ ఆకాశం ఎన్నో ఏళ్ళుగా మచ్చలేని అద్దం ముక్క
మేఘ శకలాల్లోంచీ కన్నీట ప్రవాహం తప్ప నీటి ప్రవాహం వర్షించదు
ముఖాలన్నీ చిట్లిన గాజు ముక్కల్లా కన్నీటి చారికలు కడతాయి
కష్టాలు, కన్నీళ్ళ. బాధలు, భయాలు, వర్షం....వర్షం....నీళ్ళ....నీళ్ళ....
ఎన్నో ఏండ్లుగా ఇదే పలవరింత.... ఇదే కలవరింత
ఈ ఎడారి ముఖాలపై

ఈ ముడతలు తేరిన ముఖాలపై
చినుకు చింత తప్ప కాసింత చిగురింత కన్పించదు
ఇక్కడ జీవితం మిథ్య
జీవితం అంటే అకాలంలో పండిన పండుటాకు కావచ్చు
జీవితం అంటే నిర్లక్ష్యంగా రాలిపోయే ఎండుటాకు కావచ్చు
జీవితం అంటే నగ్నంగా నాగలి మీద శిలు వెక్కటం కావచ్చు
ఇక్కడ మృత్యువు ఎప్పుడూ అకాలంలోనే దాడి చేస్తుంది
మృత్యువే కాదు బాల్యం యవ్వనం వృద్ధాప్యం
ఇవేవీ క్రమాను గుణంగా సంభవించవు
సంభవించవు గాక సంభవించవు
బాల్యాన్నీ యవ్వనాన్నీ అకాల వృద్ధాప్యం
హటాత్తుగా వరించి పీడిస్తుంది
పీడన ఇక్కడ కొత్తకాదు
పుట్టుక ఒక పీడ కల
అప్పుల్లో పట్టి....అప్పుల్లో పెరిగి.... అప్పుల్లో చచ్చిపోయే ఋణగ్రస్త
జీవితాలకు పీడన కొత్తకాదు
ఇక్కడ
జీవితం పట్ల పూచీ లేదు కనుకే జీవితం మీద ప్రేమా లేదు
జీవితమంటే నిర్లక్ష్యం, జీవితమంటే క్షామం
క్షామం నిలువెత్తు రాక్షసిలా నిత్యం వెంటాడుతుంటే
క్షణ క్షణం నిరాశా నిట్టూర్పు సెగలు నిర్వీర్యం చేసి కాటేస్తుంటే
జీవితం మీద ప్రేమ ఎట్లా సాధ్యమౌతుంది
అందుకే ఇక్కడ క్షుద్రమైన రాజకీయాలకే
మాటలు పదు నెక్కుతాయి
ఈటెలు పదునెక్కుతాయి
కోడి మెడల్లా తెగి పడతాయి తలకాయలు
నేల ఎర్ర బారుతుంది నాటు బాంబులు బద్దలై
మూర్తీభవించిన స్వార్థం విజృంభిస్తుంది పైరివేటు సైన్యమై
జీవితం ఎప్పుడూ విషాద భరితమైనప్పుడు
రంగస్థలం ఎప్పుడూ రౌద్రంగా ప్రకాశిస్తున్నప్పుడు
బీభత్స రస ప్రధానంగా గతమంతా

ఆర్తా రావాలతో ప్రతిధ్వనిస్తున్నప్పుడు
జీవితం మీద ప్రేమ ఎట్లా వికసిస్తుంది
జీవితం మీద ప్రేమ ఎట్లా ప్రవహిస్తుంది
ఈ మోడు బారిన తోటలో పూవులు ఎట్లా పుష్పిస్తాయి
తొలి కారు మబ్బుల్లో దొంగాటలాడే వాన దగాకోరుదైనప్పుడు
కమలిన ఊదార్తి బ్రతుకొక దుర్భరమై
జీవితమొక అస్థిరమై
ఎండలలో మండి మండి బండ బారిన జీవితంతో
వలస వెళ్ళే బాటసారికి
మృత్యు ద్వారాలను తెరుస్తున్న నగర రాక్షసి పరాయీకరణ నీడ
ప్రసరిస్తున్న జీవితం మీద ప్రేమ ఎట్లా ప్రవహిస్తుంది
అయినా తప్పదు...జీవిరించక తప్పదు...జీవితాన్ని ప్రేమించక తప్పదు
జీవితంతో అను నిత్యం పోరాడుతూనే ప్రేమించక తప్పదు
నీవు మౌనంగానే దాటి పోదామనుకుంటావు
నీ చుట్టూ వున్న ప్రపంచం మీద నీకు లక్ష్యం లేదనుకుంటావు
ఒక్కొక్క అడుగూ పల్లేరు ముళ్ళపై పడుతూ రక్తాలోడుతుంటే
గాయాలన్నీ విచ్చుకొని బాధంతా శరీరమై మెలి పెడుతుంటే
బాధ ఎప్పుడూ ఏకవచనం కాదు
బాధకు పర్యాయ పదం నీవు ఒక్కడు కాదు
బాధకు నిర్వచనం బహువచనం
సమూహంలో ఒంటరితనం పనికి రాదు
సామూహిక ధ్యానం అనివార్యం...
సామూహిక జలపాత స్నానం అనివార్యం.
జీవిత మంతా ఎదురు తెన్నుల్లో ఆకాశంకేసి చూస్తూ -
ఉత్తరాభాద్ర ఉరుములు లేకుండా వెళ్ళిపోతుంది
అశ్వని మెరుపు గుర్రాలెక్క వెళ్ళిపోతుంది
భరణి గాలి దుమారాన్ని వెంట తెస్తుంది
కృత్తిక రోహిణి మృగశిర పుష్యమి
మఘ పుబ్బ ఒక్కొక్క కార్తిలో నాలుగంటే నాలుగు
చినుకులు కురుస్తాయని వళ్ళంతా కళ్ళు చేసుకొని ఎదురు చూస్తే
ఎదురయ్యేవి చివరికి ఎండమావులే!

వేసిన విత్తనం కాయ కూడా చేతి కందదు.
మేసేందుకు మేత లేదు
తాగేందుకు గుక్కెడు నీళ్ళు లేవు
హృదయ విదారకంగా రోదిస్తున్న పశు జీవాల్ని
కసాయిలకు తెగనమ్ముకోక తప్పని స్థితి
కొండలన్నీ ఎండిపోయాయి, పొలాలన్నీ కూడిపోయాయి
బావులు చచ్చిపోయిన కళేబరం కనుగుడ్లలా నోర్లు తెరిచాయి
మార్కెట్లో ఆరబెట్టు కుంటున్నాయి శీలాన్ని, మానావమానాలు
బోరు బావులు బావురు మంటున్నాయి నాలుగు చినుకుల
సీతాకోక చిలుకల కోసం

మైళ్ళకు మైళ్ళు మంచి నీళ్ళ ప్రయాణం తప్పదు.
కరువు అంటే తిండి లేకపోవటం కాదు
కరువు అంటే పంటలు పండకపోవటం కాదు
కరువు అంటే గిట్టుబాటు ధర లేకపోవటం కాదు
కరువు అంటే నిత్యం కొద్ది కొద్దిగా రక్తం పీల్చే రక్తపింజారి
కరువు అంటే ఆత్మల్ని నడి రోడ్ల మీద వేలం పాటలో
తెగ నమ్ముకోవటం

కరువు అంటే నిత్య ఆత్మహననం కాదు
కరువు అంటే అనునిత్య ఆత్మహత్యించు కోవటం.
ప్రకటించాల్సిందే
కరువు మీద యుద్ధం ప్రకటించాల్సిందే
మానవ క్రౌర్యం మీద కౌటిల్యం మీద
కపట రాజకీయం మీద యుద్ధం ప్రకటించాల్సిందే
సవాలక్ష వలపాక్షిక అభివృద్ధి పరంపర మీద యుద్ధం ప్రకటించాల్సిందే.
జీవితంలో పచ్చదనాన్ని పునరుద్ధరించి నేలనూ జీవితాన్నీ పదును చేసే
చినుకు దీపాన్ని చిదిమి చిరుదీపాన్ని వెలిగించి
చీకటి బీభత్సం మీద యుద్ధాన్ని ప్రకటించాల్సిందే !

# సంకీర్ణపాత్ర గిరీశం

—డా॥ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి

"ఇదివరకే నెలకొని వున్న సమాజ చిత్రాన్ని బట్టబయలు చేయడంగాని, లేక ఊరికే వర్ణించడంగాని ఒక ఎత్తు. చరిత్రలో ఇదివరకెన్నడూ లేని ఒక సమాజాన్ని, ఇప్పుడు నిర్మాణావస్థలో వున్న ఒక సమాజాన్ని, రచయిత కూడా ఆ నిర్మాణంలో భాగస్వామిగా వున్న సమాజాన్ని చిత్రించడం మరో ఎత్తు. ఈ రెండింటినీ పోల్చడానికే వీలులేదు" అంటారు ఇల్యా ఎహ్రెన్‌బర్గ్. (రచయితా-శిల్పమూ-పు 3) గురజాడ అప్పారావు కన్యాశుల్కం నాటకం రాసే నాటికి మన సమాజం ఈ రెండో రకం సమాజంగా పరిణమిస్తున్నది. ఆ సమాజ నిర్మాణంలో రచయితా భాగస్వామిగా ఉన్నారు. అందుకే అప్పటి సమాజాన్ని - నడుస్తున్న చరిత్రను - మారుతున్న సమాజ గమనాన్ని- నిశితంగా పరిశీలించి నాటకం రాశారు గురజాడ. ఒక వ్యవస్థ నశించిపోతూ మరో వ్యవస్థ పురోగమిస్తున్న సంధి కాలంలో ప్రజలు సంఘర్షణకు లోనౌతారు. ఈ సంఘర్షణలో పురోగమన శక్తులే విజయం సాధిస్తాయి. గురజాడ ఈ సత్యాన్ని నిరూపిస్తూ ఈ నాటకం రాశాడు.

సంధికాలపు జీవితాన్ని చిత్రించే రచనలో పాత్ర చిత్రణ తీరు మామూలు కాలపు జీవితాన్ని చిత్రించే రచనలో పాత్ర చిత్రణ కన్నా భిన్నంగా ఉండటం సహజం. ఇలాంటి రచనలో పాత్రలు సహజంగా సంకీర్ణంగా ఉంటాయి. పాత వ్యవస్థ లక్షణాలు కొన్ని, నూతన వ్యవస్థ లక్షణాలు కొన్ని కలసిపోయివుంటాయి. అందువల్ల కన్యాశుల్క నాటకంలో అధిక భాగం పాత్రలు సంకీర్ణంగా కనిపిస్తాయి. పాత వ్యవస్థకు నిబద్ధుడుగా కనిపించే అగ్నిహోత్రావధాని, ఆధునిక విద్యా వ్యవస్థను ససేమిరా సమర్థించని అగ్నిహోత్రావధాని, ఆర్థిక అవసరాలకు ఆధునిక న్యాయ వ్యవస్థను ఆశ్రయించడానికి వెనుకాడడు. నూతన సమాజానికి ప్రతినిధిగా కనిపించే సౌజన్యారావు పంతులుకు భగవద్గీత సంస్కరణ సాధనంగా కనిపిస్తుంది. ఇలా కన్యాశుల్క నాటకంలో చాలా పాత్రలు సంకీర్ణ పాత్రలుగా కనబడతాయి. పాత్ర చిత్రణలో వాస్తవికతా ధోరణి ఇలా ఉండడమే సహజం.

ఇంకో రకంగా కూడా పాత్రలు సంకీర్ణంగా ఉండడానికి అవకాశం ఉంది. ఒక పాత్రను ఒక రకమైన ధోరణికో, భావజాలానికో, జీవిత పార్శ్వానికో కాక అనేక ధోరణులకు, అనేక పార్శ్వాలకు ప్రతినిధిగా వాడుకున్నప్పుడు ఆ పాత్ర సంకీర్ణమూ, సంక్లిష్టమూ అవుతుంది. ఇలాంటి పాత్ర చిత్రణ కత్తి మీద సాము వంటిది. రచయిత ఒక సమాజంలో తనకు నచ్చినవి, నచ్చనివి- రెంటినీ ఈ పాత్ర

ద్వారానే చెప్పిస్తారు. ఈ పాత్రను జాగ్రత్తగా విశ్లేషించుకోకపోతే అయోమయం ఏర్పడుతుంది. గిరీశం ఇలాంటి సంకీర్ణ పాత్ర.

గిరీశం పైకి చూడడానికి వెకిలి పాత్రగా, అవుచిత్యం పాటించని వాడుగా, విలువలు లేని వ్యక్తిగా, జీవితంలోని గాంభీర్యాన్ని నవ్వులపాలుచేసే వాడుగా కనిపిస్తాడు. అలా కనిపించే గిరీశం కన్యాశుల్కం నాటకరచనా కాలానికి చెందిన అనేక సామాజిక వాస్తవాలను - ఆ వాస్తవాలను గురజాడ అర్థం చేసుకున్నతీరును వాటిమీద ఆయన అభిప్రాయాలను ప్రతిఫలిస్తాడు. అందుకే గిరీశం సంకీర్ణపాత్ర. సంకీర్ణపాత్ర విమర్శకులకు వాళ్ళ చూపునుబట్టి అనేక రకాలుగా కనిపించడంలో అసహజమేమీ లేదు. ఈ కారణంగానే గిరీశం తెలుగు విమర్శకులకు అనేక రకాలుగా దర్శన మిచ్చాడు. అతడు కొందరికి మంచివాడుగా, మరికొందరికి చెడ్డవాడుగా కనిపించాడు. గిరీశం వల్లనే నాటకానికి ప్రాణం వచ్చిందని కొందరంటే, అతని వల్లనే నాటక సమస్య అల్లరి పాలైందని మరికొందరన్నారు. గిరీశం హాస్యపాత్ర అని కొందరంటే, కాదు విషాద పాత్ర అని మరికొందరన్నారు. గిరీశం పాత్ర చుట్టూ జీవిత వాస్తవికత ఎంతగానో అల్లుకొని ఉందని ఒకరంటే, అతని అసందర్భ ప్రేలాపనలువల్ల నాటక శిల్పమే దెబ్బతిన్నదని ఇంకొకరన్నారు. గిరీశం వంచకుడని ఒకరు భావిస్తే అతడు వ్యక్తి స్వేచ్ఛకు పరాకాష్ఠ అని ఇంకొకరు భావించారు. గిరీశం ఏ మానవుడికీ ప్రతిబింబంకాదని ఒకరంటే, అతడు మనం బాగా ఎరిగిన పెద్ద మనిషే అని ఇంకొకరన్నారు. ఇంకా గిరీశం మన సాహిత్యంలో మొట్టమొదటి అస్తిత్వవాది అని, మృచ్ఛకటకంలో శకారునివంటివాడని, పౌండ్రక వాసుదేవుని వంటివాడని, దేవాలయం మీద బూతుబొమ్మలాంటివాడని, పిక్విక్ పేపర్స్‌లో జింగిల్ వంటివాడని, హెన్రీ ఫోర్త్‌లో ఫాల్‌స్టాఫ్ వాడని, ఇన్స్పెక్టర్ జనరల్ (గొగోల్) లో క్లెస్టకాఫ్ వంటివాడని నాటకంలో నాయకుడని, నాయకుడు కాడని, నకిలీ నాయకుడని వర్ణించారు తెలుగు విమర్శకులు.

ఇలా అనేకులకు అనేక రకాలుగా కనిపించే గిరీశం తెలుగు నేల మీద పుట్టి * వందేళ్ళు నిండిన సందర్భంగా మనకెలా కనిపిస్తాడో చూద్దాం.

కన్యాశుల్క నాటకం గిరీశం ప్రవేశంతో మొదలై అతని నిష్క్రమణతో ముగుస్తుంది. నాటకంలోని ఏడంకాలలో గిరీశం ఆరంకాలలో ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని ప్రత్యక్షమౌతాడు. ఒకగొప్ప రచనలోకథానాయకుని కివ్వవలసినంతస్థానం గురజాడ కన్యాశుల్కంలో గిరీశాని కిచ్చారు. కాని గిరీశం నాటకంలో నాయకుడు కాడు. నాటకాన్ని నాయికా నాయకుల దృష్టితో చూడడం పాత దృష్టి. కన్యాశుల్కం

* వ్యాసరచనా కాలం 1992

నాటకం ఈ దృష్టికి ఒదిగే నాటకం కాదు. ఇది నాయికా నాయకులంటూ ఇద్దరు స్త్రీ పురుషుల ప్రమేయం ఉండే నాటకం కాదు. ఈ నాటకంలో సమాజమే నాయకుడు లేక నాయిక. వ్యక్తులు నాయికా నాయకులు కాకపోవడమే కన్యాశుల్క నాటక విశిష్టత. ఈ కారణంగా ఇదొక అమనికేతిహాసం అని చెప్పవచ్చు. 'కన్యాశుల్కం' అనే పేరు ఒక సమస్యను సూచించేదే అయినా నాటకం ఈ సమస్యకు మాత్రమే పరిమితమైంది కాదు. ఈ సమస్య చుట్టూ అల్లుకొనివున్న అనేక జీవిత పార్శ్వాలను ప్రదర్శిస్తుంది. ఇది ఒక సమస్యకు కాక ఒక కాలానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. ఈ విధంగా ఈ నాటకం సంకీర్ణ నాటకమైంది. సంకీర్ణత ఇతిహాస లక్షణం. 'కన్యాశుల్కం' లో శుల్కం ధనం - డబ్బు. అప్పటి పెళ్ళిలో డబ్బు శుల్కం రూపంలో ప్రధాన పాత్ర నిర్వహిస్తున్నది. ఒక పెళ్ళిలోనేగాక మొత్తం సమాజంలోనే - సమాజంలోని అన్ని రంగాల్లోనూ డబ్బు నిర్వహిస్తున్న పాత్రను ప్రదర్శించే నాటకం కన్యాశుల్కం. మానవ సంబంధాల్లో డబ్బు తన పాత్రను నిర్వహించడాన్ని ప్రదర్శించే ఈ నాటకం సంకీర్ణ నాటకం. ఈ నాటకంలో గిరీశం సంకీర్ణ పాత్ర. ఇతడు ధర్మరాజు - దుర్యోధనుడు, రాముడు- రావణుడు లేదా యజమాని - బానిస వంటి ముక్కు సూటి పాత్ర కాదు.

"గిరీశం వేములకొండ సీతారామమూర్తి కుమారుడూ, స్కూలు మాష్టారూ అయిన నిష్ఠల చలపతిశాస్త్రికి ప్రతిబింబమని గురజాడా అనేవారట"అని మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు పేర్కొన్నా, ఈ నమూనా గిరీశం రూపురేఖలకే పరిమితమయ్యుండొచ్చు. ఇంతకు ముందే అనుకున్నట్లు గిరీశం అనేక వ్యక్తుల అభిప్రాయాల ప్రతినిధి. ఈ పాత్రలో గురజాడ బహుముఖీనమైన తన అనుభవాన్ని, అభిప్రాయాలను చొప్పించారు. "రచయిత కృషిలో చాలా కష్టమైన పని పాత్రల్ని కనడం అంటారు" ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ (రచయితా- శిల్పమూ- పు 37). గిరీశం పాత్ర సృష్టిలో ఈ వాస్తవం రుజువౌతుంది.

గిరీశం పాత్ర తత్వాన్ని నాటకారంభంలో గిరీశం నోటితోనే ఒక్క మాటలో చెప్పించారు గురజాడ-"పేషన్సు వుంటేగాని లోకంలో నెగ్గలేం." నాటకంలోకి ప్రవేశిస్తూ పూటకూళ్ళమ్మను మోసం చెయ్యడం వల్ల వచ్చిన ఇబ్బందిని ప్రస్తావిస్తూ గిరీశం అన్నమాట ఇది. అతని లక్ష్యం ఒక్కటే 'లోకంలో నెగ్గడం'. సాధనం 'పేషన్స్'-సహనం. అందుకు గిరీశం నాటకంలో ఎక్కడా కోపం ప్రదర్శించడు. చెయ్యరాని పనులు చెయ్యడం వల్ల ఎన్ని క్లిష్ట పరిస్థితులొచ్చినా సహనం వహించడం, అదీ వీలు కానప్పుడు పలాయనం చిత్తగించడం-ఇదీ స్వక్షేమవాది-కారీరిస్ట్-లక్షణం. గిరీశం స్వచ్ఛమైన స్వక్షేమవాది, తనను మోసం చేసి నందుకు పూటకూళ్ళమ్మ పెద్ద గొడవ చేసింది. గిరీశంకు

బుర్రబద్దలు కొడదామా అన్నంత కోపం వచ్చింది. కాని పేషన్సు వహించాడు. వెంకటేశం 'ఒక్క ముక్క కూడా చదువు చెప్పిన పాపాన పోలేదు'. అని నిందించి నప్పుడు 'ఇలాంటి మాటలంటే నాకు కోపం వస్తుంది' అంటాడు. కాని నిజానికి అది కోపం కాదు. సహనమే. ముందు వెనుకల ఏమీ లేకుండా లోకం మీదపడి బతికేసే రకానికి చెందిన వ్యక్తి గిరీశం. అలా బతకడం కోసం వ్యక్తుల్ని, వ్యక్తుల ధనాన్ని, మానాన్ని, సామాజిక సమస్యల్ని, ఉద్యమాల్ని తనకు అనుకూలంగా మలచుకోడానికి ప్రయత్నిస్తాడు. అందువల్ల ఇతరుల కొచ్చే సమస్యల్ని, బాధల్ని లెక్కచెయ్యడు. సాగినంత కాలం ఒక చోట ఉంటాడు. సాగకపోతే మరోచోటికి మారతాడు. ఎక్కడా సాగకపోతే నిష్క్రమిస్తాడు. పూటకూళ్ళమ్మ దగ్గర చెల్లక మధురవాణిని ఆశ్రయించాడు. అక్కడ చెల్లక వెంకటేశం ద్వారా అగ్నిహోత్రావధానిని ఆశ్రయించాడు. అక్కడి నుంచి లుబ్ధావధానిని, ఆ తర్వాత సౌజన్యారావు పంతుల్ని ఆశ్రయించాడు. అందుకోసం మగదీక్షు వేషం, సరసుడి వేషం, ట్యూషన్ మాష్టారి వేషం, సంఘ సంస్కర్త వేషం ధరించాడు. ప్రయత్నాలన్నీ విఫలమై, వేషాలన్నీ వృథా అయి, రహస్యాలన్నీ బట్ట బయలై దిక్కుతోచక సాంఘిక, శక్తులు బయటికి నెట్టేస్తే 'డామిట్ కథ అడ్డగా తిరిగింది' అంటూ నిష్క్రమించాడు గిరీశం.

ఇంతకూ నాటకంలో గిరీశం చేసిన మంచి చెడు పనులేవి? పూటకూళ్ళమ్మ సంతలో సామాన్లు కొని పెడతానని నెల రోజుల కిందట ఇరవై రూపాయలు తీసుకొని డాన్సింగ్ గర్ల్ కింద ఖర్చు పెడతాడు. ఆమె యుద్ధం లాంటి గొడవ చేసింది. వెంకు పంతులు కోడలికి లవ్ లెటర్ రాస్తాడు. దేహశుద్ధి జరుగుతుందేమోనని భయపడుతూంటాడు. ఉద్యోగం చేస్తున్నట్టు అబద్ధం చెప్పి మధురవాణిని నమ్మిస్తాడు ఆమెను భరించే శక్తి లేక అక్కడి నుంచి ఉడాయించడానికి ఆలోచిస్తాడు. వెంకటేశంకు ట్యూషన్ చెప్పే నెపం మీద కృష్ణరాయపురం అగ్రహారం చేరుకుంటాడు. కిరస్తానీ అంటేనే ఎగిరిపడే అగ్నిహోత్రావధానిని చాకచక్యంగా లోబరచుకుంటాడు. కన్యాశుల్క వివాహాలు కూడవని మొదట వాదించినవాడు అవసరం కోసం అగ్నిహోత్రుని ముందు అవి వుండ వలసిందేనని మాట్లాడతాడు. యంగ్ బ్యూటిఫుల్ విడో బుచ్చమ్మను వలలో వేసుకోడానికి శ్రమిస్తాడు. డబ్బు, కీర్తి వస్తుందని ఆమెను లేవదీసుకుపోతాడు. ఆమెను గాలికి వదిలేసి వరసకు అన్న అయిన లుబ్ధావధానిని తనను దత్తత తీసుకోమంటాడు. అతను ఒప్పుకోడు. పవరాఫ్ ఆటార్నీ అయినా ఇమ్మంటాడు. అదీ జరగదు. చివరికి సౌజన్యారావు పంతుల్ని చేరుకుంటాడు. తాను పెద్ద సంస్కర్తనని, 'నెపోలియన్ ఆఫ్ యాంటీనాచ్' అని సౌజన్యారావు పంతుల్ని నమ్మించగలుగుతాడు. "మీయోగ్యతకు నాకు చాలా సంతోషంగా వుంది. మీలాంటి యెంగ్‌మెన్ లావుగా వుంటే మన దేశం బాగుపడును"

అనీ సౌజన్యారావు పంతులు అనగలిగేంతగా నమ్మిస్తాడు. మధురవాణి మగ వేషంలో వచ్చి సౌజన్యారావు పంతులు ముందు గిరీశం నగ్న స్వరూపాన్ని ఆవిష్కరిస్తుంది. గిరీశంలోని ఆషాఢభూతి బట్టబయలవుతాడు "అరె నన్ను కూడా భ్రమింపజేస్తివే" అని ఆశ్చర్యం ప్రకటించి "తక్షణం యింట్లో నుంచి బైటకి పో"అని తరిమేస్తా. గిరీశం "డామిట్ ! కథ అడ్డంగా తిరిగింది" అంటూ వెళ్ళిపోతాడు. కథ అంటే బతకడానికి గిరీశం వేసుకున్న పథకమన్న మాట. అది విఫలమైంది. ఈ నాటకంలో గిరీశం చేసిన ఒకటి రెండు మంచి పనులు కూడా ఉన్నాయి. సుబ్బిని లుబ్ధావధానికిచ్చి పెళ్ళిచేయడానికి నిశ్చయించినందుకు భర్త మీద కోపంతో వెంకమ్మ బావిలో దూకుతుంది. గిరీశం ఆమెను రక్షిస్తాడు. అగ్నిహోత్రావధాని గురించి చెడుగా ఒక ఉత్తరాన్ని లుబ్ధావధానికి రాసి అతని సంబంధాన్ని మానుకోమంటాడు. కానీ ఇవి కూడా అతడు స్వార్థరహితంగా చేసిన పనులుకావు (చూ: తిరుమలరావు, సర్దేశాయి; కన్యాశుల్క నాటక కళ) సమాజానికి మనమెంత ఉపయోగపడదామని కాక, సమాజాన్ని మనకెంత వరకు ఉపయోగించుకుందామనే ఆలోచనతో సమాజంలోనే ఉంటూ సమాజాన్ని శిథిలం చెయ్యడానికి ప్రయత్నించే ధోరణికి ఎల్లకాలం కాలం సహకరించదనే వాస్తవానికి ప్రతీక గిరీశం.

అయితే ఇలాంటి అసాంఘికమైన ఆలోచనచేసే, అసాంఘికంగా ప్రవర్తించే గిరీశంకున్న సామాజిక స్వభావం ఏమిటి ? అనే ప్రశ్న సహజంగానే పుడుతుంది. "వలస పాలన ఫలితంగా పుట్టి పెరిగిన మధ్య తరగతికి ఒక అంచున సౌజన్యారావు పంతులు, మరొక అంచున గిరీశం - మంచి చెడులకు ప్రతినిధులు" అన్న ఆర్.ఎస్. రావు (గురజాడ కన్యాశుల్కం-సామాజికాభివృద్ధి క్రమం (వ్యాసం), విభాత సంధ్యలు-పు[*])గారి అభిప్రాయమే ఈ ప్రశ్నకు సమాధానం.

వలస పాలనకు ముందు మన దేశంలో అమలులో ఉండిన ఫ్యూడల్ వ్యవస్థ వలస పాలన రాకతో శిథిలంకావడం ప్రారంభమైంది. పరిశ్రమల ప్రవేశం, మధ్య తరగతి పుట్టుక జరిగాయి. ఫ్యూడల్ వ్యవస్థలో సుస్థిర స్థానాన్ని అనుభవించిన వర్గాలు, పురోగమించబోతున్న పెట్టుబడిదారీ వ్యవస్థలో తమ స్థానాన్ని వెదుక్కోడం మొదలు పెట్టాయి. నూతన వ్యవస్థ ద్వారా లభించే సౌకర్యాలను అనుభవిస్తున్నా పాత ఆలోచనలే చేసే రకం అగ్నిహోత్రావధాని కాగా, మారిన పరిస్థితులకు అనుగుణంగా మారిన సౌజన్యారావు పంతులు-మారిన పరిస్థితులకు అనుగుణంగా మారి, తన స్థానాన్ని తాను పొందడానికి పరిస్థితులు అనుకూలించక అడ్డదారులు తొక్కే రకంగా గిరీశం కనిపిస్తాడు.

ఏ వ్యవస్థలోనైనా డబ్బు మానవ జీవితానికి ముడి సరుకు. కాని అది పెట్టుబడిదారీ వ్యవస్థలో నిర్వహించే పాత్ర మాత్రం చాలా దుర్మార్గంగా వుంటుంది ఈ

వ్యవస్థలో డబ్బు మిగతా జీవితాంశాల నుండి విలువల నుండి మనిషి దృష్టిని మరల్చి అతడిని తన ఆరాధకుడుగా మార్చేస్తుంది. ఏ చిన్నపని చేసినా లాభ నష్టాల బేరీజు వెయ్యిస్తుంది. ధనారాధన ఈ వ్యవస్థ మౌలిక లక్షణం. కన్యాశుల్కం నాటకం ఈ వ్యవస్థ మన దేశంలో కాలూనుతున్న తొలినాళ్ళలో రాయబడింది. ఆ తొలిరూపాన్ని గురజాడ నాటకంలో కొన్ని చోట్ల చూపించాడు. మూడో అంకం మూడో స్థలంలో బాల వితంతువైన బుచ్చమ్మను లేవదీసుకుపోతే కలిగే లాభ నష్టాలను గిరీశం వ్యాపార పరిభాషలోనే లెక్కగడతాడు. "తొందర పడి హాజీ సాహేబు తురకల్లో కలసిపోయినా ఉన్నట్లు నావంటి బుద్ధిమంతుడు యే పనీ చెయ్యకూడదు. దాని లాభనష్టాలు భేరీజువేసి, జమాఖర్చు చూసుకొని మరీ డిసైడ్ చెయ్యాలి. లెటస్ సీ. యింప్రిమిస్ ఒకటోపద్దు డెబిట్- (నష్టం)-విడోమారియేజి చేసుకుంటే మా వాళ్ళు అక్కర చెయ్యరు. అందుకు క్రెడిట్ (లాభం)-వాళ్ళిప్పుడు చేస్తున్న అక్కరే వుంది? గనక బాలెన్స్ (గాకబాకీ)-నిల్, బండిసున్నా! రెండోపద్దు డెబిట్ (ఖర్చు)-లోకం నన్ను బహిష్కారం చేస్తారు. అందుకు క్రెడిట్ (జమ) - లోకంలో విలువైన వస్తువును నేను అందించుకుని, పసలేని ఆ లోకానికే నేను బహిష్కారం వేస్తాను. గనుక క్రెడిట్ బాలెన్స్ (నిలవ) - యేవిఁటయా? నెగెటివ్ యడ్వాంటేజి, హేవింగ్ నథింగ్ టూ డూ విత్ పాపర్ వర్ల్డ్. పోజిటివ్ యడ్వాంటేజి. పొజెసింగ్ అలిట్స్ వెల్త్. మూడో పద్దు. డెబిట్-నష్టం- 'పీడిపెళ్ళాం వెధవ ముండ' అంటారు-వోటాజానీ-ఈ పద్దు నిజంగా డెబిటే. ఆడిట్ డిపార్టుమెంటు వార్నడిగి సంశయం తీర్చుకోవాలి అందాకా మ.రా.రా. శ్రీ గిరీశంగారి అభిప్రాయం ఏమంటే-విడో అనేది యేవిఁటి? ఏ నేమ్! ఓ పేరు. ఆ పేరు మనిషి మొహమ్మీద రాశుందా? మనిషిని పుస్తాబుచేసి యదట నిలబెడితే ఇది పునిస్త్రీ యిది విడో అని చెప్పగలిగిన పెద్ద మనిషి యవడు? ఒహడూ లేడు. గనక విడో అనే వస్తువ యక్కడుందయ్యా? వెక్కిరించే వెధవల నోళ్ళలో వుంది. దీనికి క్రెడిట్ (లాభం) యేమనగా-విడో పెళ్ళాడిందంటే అశుభం, వోగాయిత్యం అని అబెవడూ కన్నెయ్యడు. యిక డెబిట్లేని శుద్ధ క్రెడిట్, నంబర్ ఫోర్. "చుక్కల వలె, కర్పూరపు ముక్కలవలె [illegible]కీర్తి ముల్లోములన్ క్రిక్కిరిసి పిక్కటిల్లెను", అన్నట్లు గిరీశంగారికి కీర్తి [illegible] ముట్టుతుంది. [illegible]రీశంగారికి [illegible]వామహోత్సవం కథ న్యూస్ పా[illegible]ర్లలో పెద్ద [illegible]తుంది. క్రె[illegible]డిటు నెం. ఫైవ్, విడో మారియేజి యసోసియేషన్ వారు ఒక తృణం [illegible]స్తారు. బుచ[illegible] [illegible] కొంచెం డబ్బుంది డెబిట్-దావా తెస్తేగాని అవుధాన్లు మావఁగారు దాన్లో దమ్మిడీ ఇవ్వడు. ప్రోజెండ్ కాన్సన్ని విచారించగా అవశ్యం విడో మారియేజి చేసుకుని తీరవలసిందిచే!"

వలస పాలన ప్రభావంతో మన ఉమ్మడి కుటుంబ వ్యవస్థ కూడా మార్పులకు లోనైంది. విడి కుటుంబ వ్యవస్థ వచ్చింది. ఈ మార్పును గిరీశం ద్వారా చెప్పించారు గురజాడ. బుచ్చమ్మను వలలో వేసుకోడానికి ఆమెకు కొత్త కుటుంబ వ్యవస్థ పట్ల ఆసక్తి కలిగేట్లు మాట్లాడతారు. "మాటవరస మనం పెళ్లాడతాం అనుకోండి. పెళ్లాడిం తర్వాత సంసారం సుఖంగా జరుపుకోవాలంటే లావుగా డబ్బుండాలికదా! ఉద్యోగం చేస్తేగాని డబ్బు లావుగారాదే?... అట్టే డబ్బెందుకని అడుగుతారు ఒకవేళ. చెబుతాను వినండి సంసారానికి ఇల్లన్నది ఒకటుండాలిగదా....నాకు మేడలుంటేగాని కుదరదు యిలాంటి చిన్న యిళ్ళలో నాకు ఉక్కిరి బిక్కిరిగా వుంటుంది. ఆ మేడచుట్టు తోట వుండాలి. మామిడిచెట్లూ, అరటిచెట్లూ, జామిచెట్లూ చెప్పలేనన్ని వృక్షాలు వేస్తాం.... మనం అలాగ యిల్లూ వాకిలీ, తోటా దొడ్డి యార్పరచుకునేటప్పటికి మనకు చిన్న పిల్లలు పుడతారు. వాళ్ళని సంరక్షణ చెయ్యాలా! వాళ్ళు నేను కుర్చీమీద కూచుని రాసుకుంటూంటే వొచ్చి చెయ్యిబట్టుకులాగి 'నాన్నా యిదికావాలి.'అది కావాలంటారు' మీరు బీరపువ్వులాగా వొంటినిండా నగలు పెట్టుకొని చక్కగా పసుపూ కుంకం పెట్టుకుని మహాలక్ష్మిలాగా యింట్లో పెత్తనం చేస్తూవుంటే, ఒక పిల్ల యిటువేపు వొచ్చి మెడ కౌగిలించుకుని, ఒక పిల్ల అటువేపువొచ్చి మెడకౌగిలించుకునీ, 'అమ్మా యిది కావాలి, అమ్మా అది కావా'లని అడుగుతారు. వాళ్ళకి నగలూ జప్పరా చేయించాలి. జరీ దుస్తులు కుట్టించాలి.... మన పిల్లల్ని వెంకటేశంలాగా కాయ గావంచా, తెల్లచొక్కాయితో పంపించడానికి వీలుగాదు ..."

పెట్టుబడిదారీ వ్యవస్థ వస్తూవస్తూ తనకు ప్రచారసాధనమైన విద్యావిధానాన్ని కూడా వెంటతెచ్చుకుంది. సనాతన విద్యావ్యవస్థ మీద విముఖత్వమూ ఆధునికవిద్యా వ్యవస్థపట్ల వ్యామోహమూ కలుగుతున్న విధానాన్ని గురజాడ నాటకంలో చిత్రించారు. కరటకశాస్త్రిమహేశంపాత్రల ద్వారాపాతవిద్యావ్యవస్థకుకాలంచెల్లుతున్నతీరును సహజరీతిలో చిత్రికరించారు. వెంకటేశంను ఇంగ్లీషు చదివించడానికివెంకమ్మ భర్త మీద తిరుగుబాటు చేస్తుంది. ఆమె అగ్నిహోత్రావధానితో ఇలా అంటుంది. "మన వాడికో మునసబీఐనా, పోలీసుపనైనా ఐతే రుణాలిచ్చా యీ అగ్గురారం భూవులన్నీ కొనేస్తాడు. ఏడాదికో నూర్రూపాయలు కర్చుపెట్టడానికింత ముందూ వెనకా చూస్తున్నారు. మీలాగే వాడూ జంయిలు వొడుక్కుంటూ బతకాలని వుందాయేషిషి?మీకంత భారవంతోస్తే మావాళ్లు నాకుపసుపూ కుంకానికి ఇచ్చిన భూమిమ్మేసిన కుర్రాడికిచదువు చెప్పిస్తాను." పెట్టుబడిదారీ విద్యావిధానం ప్రయోజనాన్ని ఇంత స్పష్టంగా చెప్పించిన గురజాడ ఈ విధానంపట్ల సంతృప్తి చెందినట్లు కనిపించదు. ఈ విద్యావిధానాన్ని కూడా ఎగతాళి చెయ్యించడానికేనేమో గిరీశంను వెంకటేశంకు ట్యూషన్ మాష్టర్ని చేశారు. బ్రిటిష్ విద్యా విధానంవల్ల అంతా మంచే జరుగుతుందని గురజాడ భావించి

నట్లులేదు. రక్తంలో ఆలోచనలో భారతీయులుగానే ఉంటూ అలవాట్లలో మాత్రం ఆధునికులుగా మారాలన్న బ్రిటిష్ విద్యావిధాన రహస్యాన్ని గురజాడ గ్రహించినట్లు తోస్తుంది. గిరీశం సోషల్ రిఫారమ్ అంటే ఏమిటో స్పష్టంగా నిర్వహించాడు. "లోకం తప్పు తోవలో వెళుతుంటే ఆ తోవలోంచి మళ్ళించి మంచితోవలో పెట్టడ మనేది సోషల్ రిఫారమ్" అని గిరీశం అంటే "యేవిటా తప్పుతోవ?" అనిబుచ్చమ్మ ప్రశ్నిస్తుంది. జారు బురదా గట్లు గతుకులూ వున్నతోవయలా వుంటుందో యిప్పుడు మనవాళ్ళ ఆచారాలు అలా వున్నాయి. ఆ తోవలోంచి బండీ తప్పించమంచి డిమ్మసా కొట్టిన హైరోడ్డులోకి మళ్ళించాలి. అని గిరీశం బదులు చెబుతాడు. అప్పటి కుహనా సంస్కర్తల డాంబికాలకు ప్రతి రూపంగా ఈ సంభాషణ నిలుస్తుంది. సంఘ సంస్కరణోద్యమంలో చిత్తశుద్ధిలేని వాళ్ళు పాల్గొనడాన్ని గిరీశం పాత్ర ద్వారా గురజాడ చాలా చోట్ల విమర్శించారు.

అట్లని నాటిసంఘ సంస్కరణోద్యమం పట్ల గురజాడకుగౌరవం లేదనికాదు. సంప్రదాయ వాదుల ఆచారాలు సంప్రదాయ గ్రంథాల ప్రకారమే సరైనవికావని ధర్మ శాస్త్రాలు ఆధారంగా వీరేశలింగంపంతులు నిరూపించడానికి ప్రయత్నించారు. కాని సనాతనులు దానిని పట్టించుకోలేదు. ఈ అంశాన్ని విమర్శించడానికి కూడా గిరీశమే ఆధారం గురజాడకు. "మొదట్నించీ విధవా వివాహంకూడదు కూడదు అని తప్పు అభిప్రాయంలో పడిపోయివున్న అత్తగారూ మామగారూలాంటి పెద్దవాళ్ళకి వెన్నిశాస్త్రాలూ సవబులూ మనం చెప్పినా వాళ్ళకి నెత్తికెక్కవు.... మామగారు వేదంమట్టుకే చదువుకున్నారుగాని నేను శాస్త్రాలు అన్నీ చదువుకున్నాను. అటో నేను మన శాస్త్రాల్లో పుట్టోలుణ్ణి. శాస్త్రకారుడు యేవన్నాడూ? 'బాలా దపి సుభాషితం' అన్నాడు. అనగా మంచిమాట చంటిపిల్లలు చెప్పినా విని ఆ ప్రకారంచెయ్యాలం దన్యా అన్నాడు. అయితే మన పెద్దవాళ్లు శాస్త్రంలో చెప్పిన ప్రకారం నడుస్తారూ! యంత మాత్రం నడవరు. మనం శాస్త్రమూ సవబూ చూపిస్తే యేవంటారూ? యీ గుంటవెధవలు-చెప్పడం. మనం విండవూనా అని కర్రుచ్చుకుంటారు" అంటాడు గిరీశం బుచ్చమ్మతో. సంస్కరణోద్యమకారుల వాదాలపట్ల సనాతనుల మొండి వైఖరిని విమర్శించడానికే గిరీశం ద్వారా ఈ మాటలు గురజాడ అనిపించారని చెప్పవచ్చు!

అదే గురజాడ, రా.రా. గుర్తించినట్లు, అప్పటి సంస్కర్తలకు వేశ్యలపట్లగల అశాస్త్రీయ వ్యతిరేక ధోరణి మీద తన అసంతృప్తిని తెలిపాడు. ఇందుకు కూడా గిరీశమే ఆధారమైనాడు. గిరీశం బుచ్చమ్మతో మాట్లాడుతూ 'సోషల్ రిఫారమ్ అనే బండికి రెండు చక్రాలున్నాయని, ఒకటి విధవా వివాహం, రెండు నాచ్చి కొశ్చన్' అని అంటాడు. అని 'నాచ్చికొచ్చిన్ అనగా సాని వాళ్ళను హతవార్చడం' అని

అర్థం కూడా చెబుతాడు. ఈ అర్థం చెప్పడంలో గురజాడ అసంతృప్తి కంఠస్వరం ఉంది. ఈసందర్భంలోనే 'సానివాళ్ళనుహతమార్చడం మంచిదంటారా కాదంటారా?' అని బుచ్చమ్మనడుగుతారు గిరీశం. అప్పుడు "వాళ్ళను చంపేస్తారా ఏవిటి?" అని బుచ్చమ్మ భయంగా అడిగితే గిరీశం ఇలా అంటారు "చంపక్కర్లేదు! పొమ్మనక్కర లేదు పొగబెడితే చాలన్నట్లు సానివాళ్ళని పెళ్ళిళ్ళకి పిలవకపోవడం వాళ్ళని ఉంచు కోకపోవడం. పై చెప్పిన పనులు చేయనివాళ్ళని కనబడ్డచోటల్లా తిట్టడం, యిలా నాలాంటి బుద్ధిమంతులంతా ఒకప్పైకొంతకాలం చేసేసరికి కలికంలోకైనా మరి పొందుండదు"

వేశ్యావృత్తిని కేవలం నీతి సమస్యగానే తప్ప ఆర్థిక సమస్యగా చూడలేక పోయిన సంస్కర్తల ధోరణిని గురజాడ గిరీశం ద్వారా విమర్శించారు. (చూ: రామ చంద్రారెడ్డి, రాచమల్లు: గురజాడ మనస్తత్వంలోని విపరీత ధోరణి (వ్యాసం) గురజాడ సంస్మరణ సంచిక, పు-63) ప్రత్యామ్నాయాన్ని గురించి పట్టించుకోకుండా ఒక వ్యవస్థను నిర్మూలించే అనాలోచిత ధోరణికి గురజాడ పెట్టిన వాత ఇది.

గిరీశంలో తెలుగుతనం లేదంటారు ఒక విమర్శకుడు. వెంకటేశంనుసురేంద్ర నాధ్ బెనర్జీ అంతవాణ్ణి చేస్తానంటాడు గిరీశం మాటి మాటి ఇదే బెంగాలీకుర్రాడైతే అంటుంటాడు. సురేంద్రనాధ్ బెనర్జీ మొట్టమొదటి భారతీయ ఐ. సి. ఎస్. ఆఫీసరని ఆయన గొప్పఉపన్యాసకుడని అంటాడు. మాటి మాటికి 'లెక్చర్' అనేమాట కూడా అంటుంటాడు గిరీశం. గిరీశం ఈ ధోరణి ద్వారా అప్పటికి ఆంధ్రులమీద విపరీతంగా పడబోతున్న బెంగాలీ ప్రభావాన్ని గురజాడ విమర్శించారా? అవునంటున్నారు నర్సే శాయి తిరుమలరావుగారు. "ఇరువదవ శతాబ్దమున రాబోవు గొర్రెదాటు మనస్తత్వము కలయాంధ్రులకు పంతొమ్మిదవ శతాబ్దపు కడపటి దశాబ్దమునవచ్చు గిరీశం అగ్రగామి ప్రతినిధి ...ఆంధ్రులపై వంగీయుల విపరీతప్రభావమునకు గిరీశం తారకాణ. గిరీశం పాత్ర ద్వారాఅంధానుకరణమువలననాంధ్రులకు రాబోవుసంస్కృతీరుజ గురించి హెచ్చరించును కన్యాశుల్కము "(కన్యాశుల్క నాటిక కళ-పు.74) అలాగే 'లెక్చర్' అనే మాటను గురజాడ గిరీశంతో మాటి మాటికి ఎందు కనిపించారు? రెండుసార్లు జాతీయ కాంగ్రెస్ మీటింగులకు హాజరైన గురజాడకు అప్పుడు వాగాడం మేరకు కనిపించి దానిని దెప్పిపొడవడానికి గిరీశంను ఉపయోగించుకొన్నారా?

ఇలా కన్యాశుల్క నాటకంలో గిరీశంను అనేక భంగిమల్లో చూపించి అనేక రకాల పనులు చెయ్యించి సంకీర్ణ పాత్రగా మలిచారు గురజాడ.

కన్యాశుల్క నాటకంలో బట్లర్ ఇంగ్లీషు ముక్కలు ఉచ్చరిస్తూ మిశ్రమ

(తరువాయి 39 వ పేజీలో)

# అంకురార్పణ

— చల్లా రామ ఫణి

ఒక్కడి ఆలోచన ఇక్కడ వందలాది మందికి
గాయం కావడం యాదృచ్ఛికం కాదు !
ఒక్కడి ఆలోచనే మృత్యు కెరటమై జాతి జీవనాడిని
మళ్లెలా తుంచేయడం కేవలం తుంటరితనపు తతంగం కాదు!
ఒక్కడి ఆలోచనా ఫాలనేత్రమే శతఘ్నై
రోడ్లన్నీ నెత్తుటి కాల్వలు కావడం కాకతాళీయం కాదు!
ఒక్కడి ఆలోచనకే జీవనదులన్నీ రుధిర తరంగిణిలు కావడం
విధి వైపరీత్యం కాదు !
ఒక్కడి ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో అంకురించే ఆలోచనే విషవాయుగుండమై
జాతి ఊపిరితిత్తుల్లోని ఊపిరిని పిల్లర్‌లా పీల్చేసే నిరంతర ప్రక్రియ -
ఆలోచనా కాలుష్యాన్ని ఓమ్మే గుప్పెడు గుండెలు సేదదీరే
పిల్ల తెమ్మెర కావడం పిల్ల చేష్టల చాపల్యం కాదు !
నరనరాల్లో ఆలోచనలు విషపూరితం చేసే
గతకాలపు వికృత వైభవ నాస్టాల్జియా హెరాయిన్‌లా ఎక్కిపోయి
వర్తమానంలో మానవ సంబంధాలు వర్తక వస్తువులు కావడం కేవలం
వార్త కాదు !
ఇల్లిల్లా గత కాలపు మృత వీరగాథల ప్రదర్శనశాల చేసి
నడిచే నిర్వీర్య కణ వృక్షాలకు పాదుకట్టి నీరుపోసి పోషించడం
పొట్ట కూటి కోసం చేసే పని కాదు!
ఒక్కడి ఆలోచనే కోట్లాది జీవితాల వందలాది వసంతాలు
బలి తీసుకునే కత్తి అంచు కావడం కనికరించాల్సిన విషయంకాదు!
ఒక్కడు పొట్టకోసం పెట్టుకున్న కాషాయమతం
జాతి చైతన్యాన్నే బలి కోరే బలిపీఠం కావడం
బలిసిన బతుకులకు అయాచితంగా దక్కిన హక్కు కాదు !
ఒక్కడి ఆలోచనే సర్కారు దవాఖానా దయతో నెత్తురు పీల్చి
చేసిన ఆపరేషన్లో కడుపులో మర్చిపోయిన కత్తి కావడం
కడుపులో పెట్టుకు దాచుకోవాల్సిన విషయం కాదు!
మట్టిలో పుట్టినవాడు మట్టిలో ఎదిగి

మట్టి మీద మమకారంతో వజ్రంలా మెరిసి మట్టిలో
ఆలోచనలతో పాటు మట్టయి పోవడం
మరణానంతర పురస్కారాల పుష్టి సత్కారాల కోసం కాదు !
అక్షరాల అద్దంలో ప్రతిబింబించే
జన జాగృత చైతన్య ప్రభంజనాన్ని కూకటి వేళ్ళతో
పెకలించాలనుకునే వాడి కుట్ర కావడం యదార్థం !
ఒక్కడి ఆలోచన జాతి ఆలోచనలు నిర్వీర్యం చేసి
సమూలంగా పీక్చే జలగైనప్పుడు కనీసం ఒక్కడి ఆలోచనైనా
రేపుమీద ఆశను రేకెత్తించే ఆయుధం కాకపోవడం అనర్థం !
ఆలోచన ఇప్పటికైనా ఆయుధమై పునరుత్థానానికి
పిలుపునిచ్చే పాంచజన్యం కాకపోవడం అనర్థం !
కుంభకర్ణుడు సైతం సిగ్గుపడేలా నిద్రపోతున్న
కూపస్థ మండూక జాతిని మేల్కొలిపే పొలికేకలా
ఆలోచన కాకపోవడం పోయేకాలాన్ని
తిరిగి తేగలమనుకునే పోగాలం !
ఆయుధంలా ఆలోచన ఎదను కాలి
ఆయుధం అవసరమనే ఆలోచనకు అంపరార్పణ చేసే
ఆలోచనా సముద్రంలో ఆయుధాలు కెరటాలై
కేరింతలు కొడుతూ జన చైతన్య జాగృత భానుణ్ణి ప్రసవించడం
రేపటి పతాక శీర్షిక య్యేంత ప్రత్యక్షర ప్రత్యక్ష సత్యం !

(37 వ పేజీ తరువాయి)

**పాండిత్యం** వెలగబెట్టిన గిరీశం గురజాడ 1910లో రాసిన 'కొండు భట్టీయం'లో బి. ఎ. గ్రాడ్యుయేట్ అవుతాడు. సంప్రదాయ గ్రంథాలను వ్యాఖ్యానిస్తాడు. సంఘ సంస్కరణోద్యమానికి 'కెప్టెన్' అవుతాడు. కన్యాశుల్కం నాటకంలో 'లెక్చర్' అనే మాటను ఉచ్చరించడమేగాని లెక్చరివ్వని గిరీశం కొండుభట్టీయంలో జనాన్ని కూడ గట్టి సభకు ఎదుగుతాడు. అయితే స్త్రీలమీద కన్నువేయడం మాత్రం మరచిపోలేదు. ఈ నాటకంలో చివరికి ఏమయ్యాడో తెలియని గిరీశం సంఘ సంస్కరణోద్యమం లోంచి 1915 తర్వాత జాతీయోద్యమంలో చేరుంటాడు. బహుశా ఉప్పల లక్ష్మణ రావుగారి 'అతడు-ఆమె' నవలలో శాస్త్రిగా అవతారమెత్తిఉంటాడు. స్వాతంత్ర్యా నంతరం ప్రముఖ రాజకీయనాయకుడో, పేరుమోసిన కాంట్రాక్టరో అయ్యుంటాడు.

# సావిత్రి సాహిత్య జీవితం . సమీక్ష

— కాత్యాయినీ విద్మహే




'బందిపోట్లు' కవిత ద్వారా సావిత్రి నాకు 19౮5 నుండి పరిచయమే. ఓపెన్ యూనివర్శిటీ పాఠాలల్లో పద్య నిర్మాణ వ్యూహాన్ని గురించి చెబుతూ ఉదాహరణంగా ఆ కవితను పేర్కొన్నారు చేరా. మూడు, నాలుగేళ్ళు పాఠం చెప్పిన ప్రతి సందర్భం ఈ కవితా విషయాన్ని గురించి అభివ్యక్తిలోని పదును గురించి నన్ను పదే పదే ఆలోచింపచేసేది. ఆ తరువాత మళ్ళీ రెండు మూడేళ్ళకు అనుకొంటాను-ఒక సెమినారు పేపరులో ఉదహరించబడిన 'గృహిణి'కవిత ద్వారా సావిత్రిపట్ల నాకు కుతూహలం ఎక్కువైంది. చేరాగారి ద్వారా, మరికొందరు మిత్రుల ద్వారా అప్పుడప్పుడు సావిత్రిని గురించి వింటూ తెలుసుకొంటూ ఎప్పుడో ఎక్కడో కలవకపోతామా అన్న ధీరసాలో వున్న తరుణంలో 91 అక్టోబరులో ఆమె మరణవార్త వినాల్సివచ్చింది. సావిత్రిని గురించి తెలుసుకోవటానికి చివరకు మిగిలింది "సావిత్రి" పుస్తకమే. సావిత్రి రచనలను పేర్చికూర్చి, సావిత్రి గురించిన రచనలను కూడా అనుబంధంగా చేర్చి ప్రచురించిన పుస్తకమిది· సాహిత్య చరిత్రలో కొరవడిన స్త్రీల సాహిత్య జీవితాన్ని పూరించటానికి, పునర్నిర్మించటానికి ఇలాంటి పుస్తకాల అవసరం ఎంతయినా వుంది· ఇదివరలో ఈశ్వరి గురించిన పుస్తకాన్ని విరసం మిత్రులు కొందరు ప్రచురించారు· ఇప్పుడీ సావిత్రి పుస్తకాన్ని ప్రచురించి ఆ అవసరాన్ని తీర్చిన సంపాదకుడు అరణ్యకృష్ణని, ఈ కార్య భారమంతా నిర్వహించిన మిత్రులను సావిత్రి జ్ఞాపకాలను ఇలా భద్రపరిచి అందించినందుకు ముందుగా అభినందించాలి·

సావిత్రి పుస్తకంలో రెండు భాగాలున్నాయి. ఒకటి సృజన, రెండు స్మృతి. సృజన విభాగంలో సావిత్రి వ్రాసిన 23 కవితలు, ఒక కథ, ఒక గల్పిక, 7 సమీక్షలు, 9 వ్యాసాలు వున్నాయి. స్మృతిలోవున్న రచనలు 'బందిపోట్లు' కవితకు ఇంగ్లీషు అనువాదంతో సహా పదిహేడు. సావిత్రితో స్నేహ బాంధవ్యాలను, అనుభవాలు జ్ఞాపకాలను మననం చేసుకొంటూ టి కృష్ణాబాయి, టి. శ్రీనివాసరావు, నటరాజ్, పి. రామకృష్ణారెడ్డి, రాణి శివశంకర్, సతీష్ చందర్, శివలెంక రాజేశ్వరీ

దేవి, సోమసుందరాజులు, శిఖామణి, వాడ్రేవు చిన్న వీరభద్రుడు వ్రాసిన రచనలున్నాయి. బందిపోట్లు 'కవితలో'ని విర్మాణ వ్యూహాన్ని విప్పి చెప్పే చేరాత వుంది. అద్దేపల్లి, హనీఫ్, శిలాలోలిత, టి. వి. యస్. రామన్ వ్రాసిన కవితలున్నాయి. కె. వి. యస్. వర్మ వ్రాసిన 'సారాంశం' అన్న కథ వుంది. ఈ రచనలవల్ల, అరణ్య కృష్ణ సంపాదకీయంవల్ల సావిత్రి జీవితం రేఖాచిత్రంగానైనా మనకు పొడగట్టక మానదు. సావిత్రి జీవితానికి సావిత్రి రచనలకు వున్న సంబంధం చాలా గాఢమైందన్న భావం మనకు కలిగించక మానదు.

సావిత్రి 1949 లో పశ్చిమ గోదావరి జిల్లాలలోని సంప్రదాయ క్షత్రియ కుటుంబంలో పుట్టింది. బి. ఎ చదువును అర్థాంతరంగా ఆపేసి పెద్దలు 1968 లో ఆమెకు పెళ్ళి చేశారు. కుటుంబం స్త్రీ మీద అతి దుర్మార్గమైన అధికార వ్యవస్థగా పని చేస్తున్నదని తల్లి జీవితానుభవం నుండే అర్థమవుతూ వచ్చినా తానూ శాంతాన్ని, సహనాన్ని కూడదీసుకొని వ్యవస్థ నిర్దేశించిన పద్ధతిలో మంచి భార్య' గా జీవించాలని పద్నాలుగేళ్ళ పాటు తనలో తాను సంఘర్షిస్తూ విశ్వప్రయత్నం చేసింది. చివరకది సాధ్యం కాక ఇద్దరు పిల్లలతో భర్తను వదిలి బయటకు వచ్చేసి 1982నుండి స్వతంత్రంగా బ్రతకటం ప్రారంభించింది. ఒక దశాబ్దం పాటు పితృస్వామిక సామాజిక విలువలపట్ల తన వ్యతిరేకతను, తిరుగుబాటును సాహిత్య రచనల ద్వారా వ్యక్తం చేస్తూ జీవించింది.

1968 లో వైవాహిక జీవితంలోకి ప్రవేశించిన సావిత్రికి భార్యాభర్త సంబంధాలలోని అసమ లక్షణాన్ని అర్థం చేసుకోవటానికి వీలుగా తన జీవితాన్ని తాను వస్తుగత దృష్టినుండి చూసుకొనే స్థిమిత స్వభావం- చలం, రంగనాయకమ్మల సాహిత్యం, 1970 ల నుండి వికసించిన విప్లవోద్యమాల నేపథ్యంనుండి ప్రపంచ మహిళా ఉద్యమాల గురించి తెలియ వస్తున్న సమాచార అధ్యయనాలవల్ల కలిగిన చైతన్యం నుండి—అలవడింది. తన బాధకు ప్రపంచపు బాధకు మధ్యవున్న అంతరగతి తర్క స్వభావాన్ని అర్థం చేసుకొంటూ అంతర్జాతీయ మహిళా దశాబ్దంలో ఆమె ఒక ఫెమినిస్టు రచయితగా, ఆలోచనాపరురాలిగా పరిణామం చెందింది. అందువల్లనే అమె రచనలలో స్త్రీవాద దృక్పథం జీవనాడిగా కనబడుతుంది.

సావిత్రి కవితలలో ఎక్కువ భాగం స్త్రీ జీవితంలోని వ్యథను, వేదనను వ్యక్తంచేసేవే. ఆడపిల్లను కనేది, పెంచేదీ ఆంక్షలు, అధికారం కలసిన పితృస్వామ్య వ్యవస్థలో రోజు రోజుకు మృత్యు ముఖానికి దగ్గరగా తీసుకుపోయేందుకేనని అంటుంది 'అంతా నీకోసమే' కవితలో. 'బందిపోట్లు' కవిత పెళ్ళిని గురించి వున్న కల్పనిక భ్రమలను బద్దలు కొడుతుంది. పిల్లలు చెప్పిన మాట విననప్పుడు 'పెళ్ళిచేస్తా' ననో, 'నాన్నవస్తే నీ పెళ్ళవుతుందిలే' అనో బెదిరింపుగా

'అబివినేత అన్నాక తిరుగుబాటు వుండదా!' అంటుంది. 'తనను తాను తెలుసుకొన్న స్త్రీ మనికి తిరగబడక తీరేసిని ఒక చెల్లిగా అన్నను హెచ్చరిస్తుంది. గోడల్ని కూల్చే గాఢమైన ఆకాంక్షతో ముందుకు సాగాలని స్త్రీలను ప్రబోధించింది సావిత్రి.

పరాధీనపు బ్రతుకులు సహజంగా చేయబడిన ఆడవాళ్ళకోసమే కాదు ప్రపంచ బ్యాంకులకు, అభివృద్ధి చెందిన దేశాల ప్రయోజనాలకు తాకట్టు పెట్టబడి పరాధీనత స్వభావంగా చేయబడిన దేశం కోసం కూడా సావిత్రి ఆరాటపడింది. ఆ ఆరాటంలోనుండే 'అమ్మాయినో అయ్యచేతిలో పెట్టా / ఆరు నెలల్లో బూడిదై పోయింది' అని ప్రారంభించి పూర్వ, గాష్టిం, చివరకు దేశం పరాధీనమై పోయిన క్రమాన్ని సూచిస్తూ 'దేశాన్ని అయ్య చేతిలో పెట్టాం/ పెంచక్కా తాకట్టు పెట్టే శాడు' అని ముగిస్తూ 'పరాధీనత' అన్న కవిత వ్రాసింది సావిత్రి. ఈ విషయంలో ఈమె మీద చెరబండరాజు ప్రభావం వున్నట్టు కనబడుతుంది. చెరబండరాజు సావిత్రికి నచ్చిన కవి. అతని గురించి ప్రత్యేకం రెండు కవితలు వ్రాసింది. 'తాకట్టు పాలైన తల్లి భారతిని / తలచి తలచి నీవు తల్లడిల్లావు' అని అతని బాధతో తానూ మమేకమైంది.

సావిత్రి కవితకు సంక్షిప్తత, స్పష్టత, వ్యంగ్య ధ్వని అలంకారాలయితే వచనానికి సూటిదనం, చురుకుదనం, పదును నిచ్చాయి. సావిత్రి వచన రచనా విధానం మీద రంగనాయకమ్మ ప్రభావం ప్రధానమైంది. 'బతుకు పుస్తకం' అంపశయ్య, పచ్చనాకు సాక్షిగా, మనలో మనం, మనకు తెలియని మన చరిత్ర మొదలయిన పుస్తకాలమీద ఆమె వ్రాసిన సమీక్షలు ఆమె అవగాహనా శక్తిని వ్యక్తం చేయటమేకాక బాధలలో వున్న వాళ్ళలో మమేకమయ్యే జీవన స్వభావాన్ని, జీవితంపట్ల వున్న అపారమైన ప్రేమను, గౌరవాన్ని వ్యక్తం చేస్తాయి.

సావిత్రి వ్యాసాలు ప్రధానంగా స్త్రీల భావనలను, ఆలోచనలను స్త్రీలు మాత్రమే స్వీయ జీవితానుభవం నుండి గ్రహించి సమర్థవంతంగా వ్రాయగలుగుతారన్న స్త్రీవాద దృక్పథం నుండి వ్రాయబడినాయి. 'స్త్రీల కోసం' 'సాహిత్య పోలీసులు' మొదలైన వ్యాసాలు ఆ కోవలోవే. 'ఏ స్వేద బిందువు చరిత్రను నిర్మించింది?' అన్న లూసన్ రచనపై విమర్శ వ్రాస్తూ సావిత్రి చాలా సూటిగానూ, నిర్ద్వంద్వంగానూ స్త్రీల కోసం ఎవరు వ్రాసినా అని సగం న్యాయమే అవుతుందని - స్త్రీల ఆలోచనలను స్త్రీలే సక్రమంగా వ్యక్తం చేయగలుగుతారని అంటుంది. అట్లా తమ గురించి తామే వ్రాసుకోగలిగిన స్థితికి స్త్రీలు ఎదగాలని ఆకాంక్షించే సావిత్రి ఈ అభిప్రాయంతో భేదించే వాళ్ళను ఎంత తీవ్రంగా వ్యతిరేకిస్తుందో 'సాహిత్య పోలీసులు' వ్యాసంలో వ్యక్తమవుతుంది. 'భావ కవిత్వంలో

స్త్రీ అనే సిద్ధాంత, వ్యాసాన్ని వ్రాస్తూ స్త్రీవాద దృక్పథంతో భావ కవిత్వాన్ని విలువ కట్టిన జయప్రభను విమర్శిస్తూ పి. యస్ 'ఆంధ్రజ్యోతి'లో వ్రాసిన వ్రాతలకు ప్రతి విమర్శ ఈ వ్యాసం.

'స్వాతంత్ర్యానంతరం' స్త్రీ స్వేచ్ఛ, అనే వ్యాసంలో స్త్రీ పురుషులు అసమానులన్న భావనను రక్తగతం చేసుకొని ఆడపిల్ల పుట్టకనే వద్దనుకొనే వాళ్ళున్న సమకాలీన సమాజంలో, ఆడపిల్లకు అన్నదమ్ములతో సమంగా తిండీ, బట్టా, చదువూ, సెలవలూ, ఉత్సాహాన్నిచ్చే కాలక్షేపాలు ఇయ్యాని కుటుంబాన్ని ప్రసాదించి పితృస్వామ్య సమాజంలో స్త్రీకి స్వేచ్ఛ పోరాటం చేస్తే తప్ప రాదని ఖచ్చితంగా చెబుతుంది సావిత్రి.

'ఆడలేక....' వ్యాసంలో ఆడవాళ్ళు ఉద్యోగం చేయటంపట్ల సమాజంలో వున్న అరకొర అవగాహనను గురించి వ్రాస్తూ "ఆడవాళ్ళు ఉద్యోగాలకు వెళితే సమస్యలుంటే ఉండవచ్చుగానీ అవి ఉద్యోగాలు మానేస్తే పోయేవికావు" అని చెప్పిన సావిత్రి ఆలోచనల్లో ఎంతో స్పష్టత కనబడుతుంది. "నూటికి తొంభై మంది ఆకలితో అల్లాడే దేశంలో ఆడవాళ్ళ సమస్యల గురించి వేరే చర్చించటం తప్పు" అనే అభిప్రాయంతో సావిత్రి ఏకీభవించదు. "ఆకలి సంగతి సరే మరి అవమానం సంగతేమి''టని సూటిగాప్రశ్నిస్తుంది.

పితృస్వామిక సామాజిక వ్యవస్థలో స్త్రీల మీద ఎంత హింస అమలు కావటానికి వీలుందో,ఎన్ని అవమానాలు మోస్తూ వాళ్ళు జీవించాల్సి వస్తుందో తన తల్లి జీవితంనుండి తెలుసుకొంది సావిత్రి. అన్ని అవమానాలు భరిస్తూ కూడా అవి ఆడదాని జీవితంలో చాలా సహజమైనవి అన్నట్లుగా భావించి జీవించిన తల్లిని చూస్తే సావిత్రికి ఆశ్చర్యం. తల్లిని అనుక్షణం వేధించుకు తిన్న తండ్రి మీద సావిత్రికి తగని అసహ్యం. ఆ అనుభవాలను క్రోడీకరిస్తూ సావిత్రి 'అమ్మ' అన్న రచన చేసింది. కుటుంబ వ్యవస్థలో ఓడిపోయి ఒదిగిపోయి జీవిస్తున్న ఆడవాళ్ళ కనిపించని వేదనలను, ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగునపడి వినిపించని ఆత్మ చరిత్రలను తెలుసుకోవటానికి ఇలాంటి రచనలు ఎంతయినా ఉపయోగపడతాయి. అయితే సావిత్రి అర్ధాంతక మరణం వానిని అసంపూర్ణంగా మిగిల్చింది. అమ్మ దగ్గరనుండి ప్రారంభించిన ఆ చరిత్ర రచన సంపూర్ణమై వుండి వుంటే స్త్రీల చరిత్ర రచనలకు ఒక నమూనా తయారై వుండేది.

పితృస్వామ్య సామాజిక వ్యవస్థలో అణచివేతకు అవమానాలకు గురవుతున్న స్త్రీలందరి బాధను తన బాధగా చేసుకొన్న ఆత్మాశ్రయ భావనా తీవ్ర లక్షణం

(తరువాయి 48వ పేజీలో)

దోసెడు మంచి నీళ్ళ కోసం
కోసెడు దూరం నడిచి
కడివెడు గంజిలో
పిడికెడు మెతుకుల కోసం
చీకటినీ వెలుతురునీ కలిపేసి
కష్టాల క్షేత్రాల్లో
సుఖాలను పాన్పు చేస్తున్నవాడా ?!
నీవు రైతువి
నీవే రైతు కూలీవి
నీకు కష్టం తప్ప కాలం తెలియదు
వరి గింజల కరుకుదనం
నీ చర్మాన్ని వలిచేస్తున్నప్పుడు
చెమట తప్ప శ్రమ తెలియదు
గోధుమ గింజలను గాదెల్లో పోసినప్పుడు
నీ రక్తాన్నే.........
చెరుకు రసంగా తీసినప్పుడు
నీకు దాస్యం తప్ప దాహం తెలియదు
ఆకు పత్ర హరితంలో
నెత్తుటి చారలు రుచి మరిగిన సామ్రాజ్యవాది
చేను కంకుల్లో మానవ కంకాళాలను ఏరుకు తిన్న భూస్వామి
కలగలసిన మధ్య దళారి
దేశం ముఖమ్మీద
ఉక్కు పాదాలతో తొక్కుతున్నప్పుడైనా
ముఖం చిట్లించదని దాక్కుంటావా ?
మట్టిని పెకలిస్తూ మేల్కొంటావా ?
(డంకెల ప్రతిపాదలను నిరసిస్తూ)

— నిశితాసి

"అంటే...? నీ కిస్తానన్నీ రూపాయి తీసుకపోయి ఆ బిచ్చపోళ్ళకిస్తానంటవు? భలే ధర్మాత్ముని వున్నవు...! పెద్దోనివైనంక పెయ్యిన మీది బట్టలు గూడ ఒలిసిచ్చె టట్టున్నవు... అట్లయితె చిప్పలు చేతికస్తయి బిడ్డ...! సరెగని ఈ పది పైసలిచ్చి రా పో..." కోపంగా అంది కమల.

ముఖం మాడ్చుకొని అక్కన్నుంచి కదల్లేదు ఆదిత్య .... "ఆ అమ్మాయి" బాగక్కరుంది.... అవసరమున్న వాళ్ళను సాయం చెయ్యాలన్నాడు నాన్న ....! నా కిస్తనన్న పైసలన్న ఇయ్యమంటె ఎందుకియ్యవు ....? పోనియ్ ....! అర్ధ రూపాయన్నియ్యి....!" కొంచెం కోపంగా అన్నాడు ఆదిత్య....

---

(44 వ పేజీ తరువాయి)

చేత సావిత్రి రచనలలో వేడీ వాడీ రెండూ కనిపిస్తాయి. పితృస్వామిక పురుష దురహంకారాన్ని ఖండించటంలో ఆమెలో చాలా సార్లు పురుష ద్వేషపు ఛాయలు వ్యక్తమవుతాయి. అయినా ఆమె జీవితావగాహనలో నిజాయితీ సమాజంలో మార్పుకోసమైన ఆకాంక్ష బలీయంగా వుండి ఆమె నెందరికో స్నేహితురాలిగా చేశాయి. "వ్యవస్థలో మార్పుకోసం బుర్రలే కాక కాళ్లూ చేతులూ కూడా ఉపయోగించాలి మనం" అన్న అవగాహనలో రాశిలో తక్కువే అయినా వాసిలో మిన్న అయిన రచనలు చేసి ఆరోగ్యకరమైన భావాలను పంచి పెట్టి, ఈ వ్యవస్థ స్త్రీలకు ప్రసాదించిన అసమానత్వంతో, కష్టాలతో కన్నీళ్ళతో సంఘర్షించి తాను అనారోగ్య పాలయి మరణించింది. సావిత్రి అసమానత్వాన్ని దహించే అగ్నికి సంకేతమైన సావిత్రి సాహిత్య జీవితాన్ని అందరికీ అందుబాటులోకి తెచ్చిన మిత్రుల కృషి ఎంతయినా ప్రశంసనీయం. అందరూ చదవవలసిన ఈ మంచి పుస్తకాన్ని అందంగా ముద్రించటమే కాక 15 రూపాయలకే పాఠకుల కివ్వటం మిత్రులు చేసిన మరీ మంచి పని. ●

---

సావిత్రి : సంపాదకుడు : అరణ్య కృష్ణ (సావిత్రి రచనలు)
పేజీలు 141 వెల : రు. 15/00
దొరుకుచోటు మైత్రి బుక్ హౌస్, విజయవాడ.

---

"ఆమె కక్కూరుందట ...? ఈయన రూపాయలకు రూపాయల దానంచేస్తా డట....? మీ నాన్నకేంది ....? ఆయనో పిచ్చోడు .... పేదరికమని, దానాలని ఏమోమో చెబుతుంటాడు. ఆయనకు చదువైతే ఉందికాని లోకజ్ఞానం లేదు.... సరెగని.... అవి ఒద్రుకుంపె తలకాయనొస్తంది. వయసుకు మించిన మాటలు పనులు ... తొందరగ పొయ్యి ఈ పది పైసలిచ్చొస్తవా ....? లేకుంటె నేందొయ్యి దాన్ని వెళ్ళగొట్టనా....? అయినా నువ్వు మధ్యాహ్నం స్కూలుకు పోక ఇంట్లో ఎందుకున్నట్లు ....?" అని మంచంలోంచి లేవదోయింది కమల....

తల్లి దగ్గర్నుంచి పది పైసలు తీసుకున్నాడు ఆదిత్య .... తల్లిని కోపంగా చూసాడు ... తన దగ్గర అప్పుడు డబ్బులేం లేనందుకు చింతించాడు .... ఆ పది పైసలు తీసుకెళ్ళి ఆ అమ్మాయి చేతిలోవున్న బొట్టలు పడ్డ గిన్నెలో వేశాడు....

"ధర్మాత్ముసిని బాబు.... నీ కడుపు చల్లగుండ .... నిన్ను దేవుడు చల్లగ చూస్తడు బాబు ..." ఆశీర్వదిస్తూ వెళ్ళిపోయిందా అమ్మాయి....

ఇచ్చిన పది పైసలకు పదే పదే ఆశీర్వదిస్తూ వెళ్ళిపోయిన ఆ అమ్మాయి మాటలు ఆదిత్య చెవుల్లో గింగురు మంటున్నాయి. ఆకలితో అలమటిస్తున్న ఆ అమ్మాయికి తానొక రూపాయైనా పైసలైనా ఇవ్వలేక పోయినందుకు బాధగా వుంది. ఎంత బ్రతిమలాడినా డబ్బివ్వని తల్లిపై కోపంగా వుంది .. ముఖం మాడ్చుకొని తన గదిలోకెళ్ళి మంచంలో పడుకున్నాడు....

"పరోపకారార్థ మిదం శరీరం ..."
పాఠశాలలో గురువు చెప్పిన మాటలు ...
"అవసరమున్న వాళ్ళ నాదుకావాలి...."
ఇంట్లో తండ్రి చెప్పిన మాటలు ఆదిత్య చెవుల్లో ప్రతి ధ్వనిస్తున్నాయి.
"ఛీ ! ఈ పెద్దల మాటలకు, చేతలకు పొంతనే లేదు ..." తనలో తానే గొణుక్కున్నాడు.

ఇంటి కొచ్చిన బిచ్చగాళ్ళకు గాని, మరెవ్వరికిగాని అమ్మ తనతో, తన చెల్లెలితో ఎన్నోసార్లు దానం చేయించడం జ్ఞాపకం చేసుకున్నాడు. ఎందుకని తనడిగితే పుణ్యం రావాలని తల్లి చెప్పడం జ్ఞాపకం వచ్చింది....

రకరకాల మనుషులు అడుక్కోవడానికి రావడం - అమ్మ తన చేతికో, చెల్లెలు చేతికో డబ్బిచ్చి వాళ్ళకు ఇచ్చి రమ్మనడం ఆదిత్య కళ్ళముందు కదులుతున్నాయి.... అతని మనసు గత జ్ఞాపకాల్లో తిరుగుతుంది....

u

ఉడికిపోయిన వారి పతిపిచ్చి — అసహ్యించుకునే మనసు. జగన్

కర్మైన శరీరాలతో వీధుల్లో కుష్ఠు బిచ్చగాళ్ళు తిరుగుతున్నారు .... డప్పు వాయిస్తూ, జెండా పట్టుకొని, మొండి చేతులకున్న డబ్బాలకు గల గల లాడిస్తూ "ధర్మం చెయ్యండి బాబూ ....!" అని దీనంగా అరుస్తున్నారు....వాళ్ళను చూసి అసహ్యించుకుంది కమల.... ఆదిత్య చేతికి పది పైసలిచ్చి వాళ్ళ డబ్బాలో వేసి రమ్మంది.... ఆదిత్య వాళ్ళ దిక్కు పరుగెత్తుతుంటే "ఆగాగు! వాళ్ళ దగ్గరకు పోకు. నేను వేసొస్త....

అని ఆ పది పైసల బిళ్ళ తీసుకొని తానే వాళ్ళ డబ్బాలో వేసొచ్చింది కమల.

ఏడుస్తున్న పిల్లవాన్ని నడుముకు కట్టుకొని చిప్ప చేతిలో పట్టుకొని ఎండి పోతున్న డొక్కలోంచి ఎగపోత తన్ను కొస్తుండగా—

"దొరా ! పైసలెయ్యండి...."

"దొర్సానీ బుల్లెడు బువ్వేయిండి...."

అని దీనంగా అరుస్తూ అడుక్కుంటున్నారు—వాళ్ళను కసిరే వాళ్ళు కసురుతున్నారు.... కమల అలాంటి వాళ్ళ నెన్నోసార్లు కసిరి వెళ్ళగొట్టింది. కొన్ని సార్లు ఆదిత్య చేతికో, అతని చెల్లెలు కవిత చేతికో పది పైసలిచ్చి వాళ్ళ గిన్నెలో వేసిరమ్మంది... అలాగే చేశారు వాళ్ళు....

"బాల్‌సచ్చా చల్లగ రహెనా దీ అల్లాకే నామ్‌కా....

అల్లా మిమ్ముల చల్లగ చూస్తడు దీ అల్లాకే నామ్‌కా...."

ఓ చేతిలో నెమలి ఈకలలో, మరో చేతిలో మైసక్షి పొగలొచ్చే ఇత్తడి ముంతతో ఎన్నో సార్లు ఫకీర్లొచ్చారు. పావలా, అర్ధరూపాయిచ్చి వాళ్ళ జోలెలో వేసి రమ్మంది కమల.... అలాగే చేసాడు ఆదిత్య.

దీవిస్తూ వెళ్లిపోయాడు ఫకీరు.

ఎలుగు బంట్లను ఆడిస్తూ, గంగిరెద్దుల నాడిస్తూ జానపద భిక్షకులు వచ్చారు.

వాళ్ళెంత మొత్తుకున్నా పావలా కంటె ఎక్కువిచ్చేది రాదు కమల—చాలా సార్లు ఆదిత్యే తీసుకెళ్ళి డబ్బిచ్చాడు.

చేతిలో పంచాంగంతో, నుదుట నామాలలో తమలపాకులు నములుతూ అయ్యవారొచ్చాడు....

"వైష్ణవుణ్నొచ్చాను తల్లీ — దానం చెయ్యండి — మీకు శ్రీ వెంకటేశ్వరుల కృప వుంటుంది—" అని కేకేసాడు.

కమల చాలాసార్లు అర్ధరూపాయో, రూపాయో చేతి కిచ్చి అయ్యగారి కిచ్చి రమ్మంది ఆదిత్యను.

అయితే అయ్యవార్లకంత తక్కువా ఇచ్చేదని ముఖం మాడ్చుకొని వెళ్ళి పోయేవారు వాళ్ళు

కాషాయ వస్త్రాలు ధరించి, పంచాంగం లాంటిది చేతిలో పట్టుకొని వాకిట్లో నిల్చున్నాడు.... భక్తులు.

"సాయి కృప వుంటుంది మీకు— మీ సంపదలు వృర్ధవుతాయి .... సాయి బాబా దగ్గరి కెళ్తున్నాను ... బాగా దానం చెయ్యండి బాబూ ....! దానం చెయ్యండమ్మా....!"

అని కేకలేసారు...

రెండు రూపాయలిచ్చి తీసుకొమ్మంది కమల.... "బాబా కృప వుంటుంది— ఐదు రూపాయలైనా దానం చెయ్యండమ్మా.... బాబా దగ్గరి కెళ్ళడానికి ఖర్చులకు కావాలి.... బాబా ఆశీర్వదిస్తాడు అని చేయి చూస్తానని ఆదిత్య చేయి చూసి ఏవేవో జెప్పి పది రూపాయలు తీసుకెళ్లారు...

బిచ్చగాళ్ళకు ఆకలితో అలమటిస్తూ బాధపడ్తున్న వాళ్ళకు పావలా ఐనా ఇవ్వడానికి వెనకాడిన తన తల్లి ఇలాంటి వాళ్ళకు రూపాయలకు రూపాయలివ్వడం జ్ఞాపకం చేసుకున్నాడు ఆదిత్య.

పెద్ద వాళ్ళ ప్రవర్తన గూర్చి ఆలోచిస్తున్న ఆదిత్యకు ఎన్నో జ్ఞాపకాలు వస్తున్నాయి... దానం చెయ్యడంలోనూ పెద్దలు చూపే అంతరాలు కళ్ళ ముందు కదులుతున్నాయి...

ఓ రోజు ఓ బ్రాహ్మణుడితో జరిగిన ఘర్షణ జ్ఞాపకం వచ్చిందాదిత్యకు...

చేతిలో పంచాంగం పట్టుకొని, నుదుట విభూతి రాసుకొని భుజంపై పంచె వేసుకొనొచ్చి వాకిట్లో నిల్చున్నాడు బ్రాహ్మణుడు. "బ్రాహ్మణుల మొచ్చాం తల్లీ ...! దానం చెయ్యండి "

ఆ మాటలు విని కమల బయట కొచ్చింది. తల్లితోపాటు ఆదిత్య కూడా బయటకొచ్చాడు... ఆదిత్యకు అర్ధరూపాయిచ్చి అతని కివ్వమంది... డబ్బు తీసు కెళ్ళి అతని చేతిలో పెట్టాడు ఆదిత్య. "బ్రాహ్మడికి అర్ధరూపాయా దానం చేసేది? లోకంలో మంచీ చెడూ భేదం లేకుండైతంది. నాకే మద్దు." కోపంగా అని అర్ధ రూపాయి నేలపై విసిరేసాడతను.

అక్కడే నిల్చున్న కమల దగ్గరి కొచ్చి ఆ డబ్బు చేతిలోకి తీసుకుంది. పోతున్న బ్రాహ్మన్ని ఆగమంది.

"పోనీ లేమ్మా ? అతని కవసరం లేదేమో పైసలు" అన్నాడు ఆదిత్య.

"నీకు తెలియదు బాబా ! బ్రాహ్మణ శాపం మంచిది కాదు." ఆదిత్యతో అని-

"అంత కోపమెందుకయ్యగారు! అట్లాగండి." అని ఇంట్లో కెళ్ళి మరో రూపాయితెచ్చి రూపాయిన్నర అతని చేతిలో పెట్టింది కమల. అయినా ముఖం ముడుచుకునే ఉన్నాడతను.

"బ్రాహ్మలంటే పూర్తిగా లెక్కలేకుండైంది. ముష్టివాళ్ళకేసినట్టుమాక్కూడా అర్ధరూపాయి, పావలా వేస్తారు. అందుకే కాలమిట్లుంది." అని ఆశీర్వాదంకూడా ఇవ్వకుండానే వెళ్ళిపోయాడతను గొణుక్కుంటూ.

ఇన్ని రోజులుగా జరిగిన ఎన్నో విషయాలను జ్ఞాపకం చేసుకున్నాడు ఆదిత్య.

పది పైసల నుండి, పది రూపాయల వరకు వ్యక్తులను బట్టి తనతల్లి దానం చెయ్యడం జ్ఞాపకం చేసుకున్న ఆదిత్యకు తల్లినేమనాలో తోచడంలేదు. అర్ధ రూపాయిచ్చినా కింద పడేసిన బ్రాహ్మడికి భయపడి రూపాయిన్నర ఇచ్చిన తల్లి— అరిచి గీపెట్టినా ఆ బిచ్చగత్తెకు పది పైసల కంటె ఎక్కువెందుకివ్వలేదో అతనికర్థం కావడంలేదు. కొందరికి భయభక్తులతో రూపాయలకు రూపాయలివ్వడం, మరి కొందరికేమో ఇచ్చే పది పైసలైనా తిడుతూ ఇవ్వడంలోని పెద్దల అంతర్యం ఆ పసివాడికి తెలియడం లేదు.

అపాత్ర దానం గూర్చి, అవసరమున్నవాళ్ళ నాదుకోవాలన్న పెద్దల మాటల గూర్చి ఆలోచిస్తున్న ఆదిత్యకు తల్లిపై కోపంగా వుంది. ఏదేమైనా ఆకలితో అలమటిస్తున్న ఆ అమ్మాయికి అర్ధ రూపాయైనా ఇవ్వని తల్లిని అడగాలనుకున్నాడు.

మంచం లోంచి లేచి నిల్చున్నాడు.

సాయంత్రమవుతుంది ... ఆఫీసు నుంచి తండ్రొచ్చే వేళవుతుంది ... వంటింట్లో వున్న తల్లి దగ్గరి కెళ్ళాడు

"అమ్మా ! అమ్మా !" అని పిలిచాడు.

"ఏంది బాబూ !" అని వెనుకకు తిరిగింది కమల.

"ఎంత మొత్తుకున్నా ఆ పాపకు అర్ధ రూపాయన్నా ఎందుకియ్యలేదు ?"

"ఆ విషయం నువ్వింకా మరిచిపోలేదా .. ? ఆ బిచ్చగొత్తెరి గురించే ఇంకా ఆలోచిస్తున్నావా ....? సరెగని హోంవర్కువి చేసావా....? మీ నాన్నొచ్చి పగలు స్కూలు కెందు వెళ్ళలేదని కేకలేస్తాడు—!" అంది కమల.

"ఇవ్వాళ్ళ స్పోర్ట్స్ డే—పాఠాలేం జరుగ లేదు.... హోంవర్కూ లేదు— నేనాటల్లో లేనని పగలు స్కూలుకు పోలేదు— సరేగని అమ్మా! కొందరికైతే రూపాయలకు రూపాయలిస్తవు—ఆ పిల్లకేమో అఠానన్నా ఇయ్యలేదు— ఆ పిల్ల కంటె ఆ సంచాంగ పాయిన కివ్వడమే ఎక్కువా అమ్మా—?"

బాబు ప్రశ్నకు ఆశ్చర్యపోయింది కమల— ఆతని తర్కబద్ధమైనప్రశ్నకు సమాధానం చెప్పడానికామె సిద్ధంగా లేదు— ఆ మాటలను చిన్న పిల్లాడి మాటలుగా తీసుకొని "ఓ బిచ్చపోరికి దానం చెయ్యడం, బ్రాహ్మడికి దానం చెయ్యడం ఒక్కటెలా అవుతుంది—? బ్రాహ్మడికి దానం చేస్తే పుణ్యమొస్తుంది—" అంది.

"అమ్మా! అవసరమున్న వాళ్ళకు దానం చెయ్యాలా—? మనుషులను బట్టి చెయ్యాలా —?"

ఆ ప్రశ్నకు విసుక్కుంది కమల.

"జానెడు లెవ్వు కాని పెద్ద పెద్ద ప్రశ్నలా నువ్వూ! అసలా అడుక్కునుడే తప్పు — ఏదన్నా పని చేసుకోవాలె కని అడుక్కును డెందుకు— ?"

బిచ్చగాళ్ళ గూర్చి, వాళ్ళ నిస్సహాయత్వం గూర్చి ఓసారి తండ్రి చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి ఆదిత్యకు—

"అడుక్కునుడు తప్పైతె ఎవ్వలడుక్కున్నా తప్పేకదమ్మా....? మరా బిచ్చగాల్లందరికి పని చూపెడ్తావ —?"

"ఆ బిచ్చపోరి గురించి సవాలక్ష ప్రశ్నలు— నువ్వూ—చిన్న మనిషి— పెద్ద పెద్ద మాటలు— ఈ పెద్ద మనిషి బిచ్చగాళ్ళ నుద్ధరిస్తడేమో—? నోర్మూసుకొని నీ పని నువ్వు చూసుకో...."

తల్లి కసురుకునేసరికి ముఖం చిన్నబుచ్చుకున్నాడు ఆదిత్య— ముఖం మాడ్చుకొని ముందు రూంలోకొస్తున్న కొడుకును అప్పుడే ఇంట్లోకొస్తున్న విజయ కుమార్ చూసి దగ్గరకు తీసుకొని, "ఏమైంది బాబూ—? ఏమైంది—?" అన్నాడు.

"మీకు గౌతమ బుద్ధుడు పుట్టిండు— ఎవ్వల కాకలైనా ఈ పెద్ద మనిషికే కావాలె— బిచ్చ పమ్మాయికాకలైతందట— అఠానన్నా ఇయ్యన్నాడు — తనియ్యమంటె నేనియ్యలేదని ముఖం మాడ్చుకున్నడు—నన్ను ప్రశ్నలతోని పేధిస్తండు." వంటింట్లోంచి బయటకొచ్చి చెప్పింది కమల. జరిగిన విషయమంతా క్లుప్తంగా వివరించింది.

సోఫాలో కూర్చొని కొడుకును అప్యాయంగా మరింత దగ్గరకు తీసుకున్నాడు విజయకుమార్.

ఆ వేళ్ళ వయసులోనే స్కూలు నుండి వచ్చేటప్పుడు వాను తడుస్తూ కూడా

తన మిత్రుడికి గొడుగు కింద చోటిచ్చిన బాబు దయార్ద్ర హృదయాన్ని జ్ఞాపకం చేసుకున్నాడు విజయకుమార్. ఇతర్ల బాధలు చూసి స్పందించె దయాగుణం, తన దగ్గరున్న దికొంతైనా ఇతర్లకివ్వందే తినని దాన గుణం గల కొడుకును గర్వంగా చూసాడు.

"బాబూ! యాచననేది ఏ జాతికైనా కళంకం తెచ్చేదే — కాని, చాలామంది వేరే ఏ మార్గం లేకపోవడంవల్లే ఈపని చేస్తుంటారు. అయ్యవార్లైనా, బ్రాహ్మల్లైనా ఎవ్వరైనా ఇతర విధంగా బ్రతుకుదెరువు లేకపోవడం వల్లనే ఈ మార్గాన్నెన్నుకుంటున్నారు — వాళ్ళకు చేయదగ్గ పనంటూ లభిస్తే ఇప్పుడున్న వాళ్ళలో తొంభై శాతాన్ని మించి అడుక్కోవడం మానుకుంటారని నా అభిప్రాయం—" అన్నాడు విజయకుమార్.

"అది కాదు నాన్నా! నేనడిగింది— అవసరమున్న వాళ్ళకు దానం చేసుదే నిజమైన దానం గదా—! మరి ఆకల్తోనున్న బిచ్చపమ్మాయికి దానం చెయ్యద్దా మరి—? మరి అమ్మ నేనెంత చెప్పినా ఆ అమ్మాయికెందుకు ఐానన్న ఇయ్య లేదు—?"

ఆ బాబుకేం జవాబివ్వాలో వెంటనే తోచలేదు విజయకుమార్‌కు— పిల్లలకు ప్రశ్నించడం నేర్పాలన్న తన ప్రిన్స్‌పుల్స్‌కు అనుగుణంగా ఆదిత్య ప్రవర్తిస్తున్నందుకు అతనికి ఆనందంగానే వుంది— కొద్ది క్షణాలాగి ....

"బాబూ! ఈ సమాజ స్వరూపమే ఇంత— ఉన్నవాడు, లేనివాడు ఉన్నవాడి పక్షముండటానికే చూస్తారు—కడుపు నిండ తిన్నవాడికే, తినే అవకాశం ఉన్న వాడికే భోజనం పెట్టడానికిష్టపడతారు కాని ఆకలిగాఉన్నవాడికి కాదు—అట్లని బ్రాహ్మలు ఉన్నవాళ్ళని నేను చెప్పడం లేదు—

"ఇందులో మీ అమ్మను, అమ్మలాంటి వాళ్ళను నేరస్థులనుచేయడానికివీల్లేదు. సమాజ లక్షణాలను బట్టి వాళ్ళు ప్రవర్తిస్తున్నారు—ఫలాపేక్ష రహితంగా కాకుండా తాము చేసే ప్రతి పైస దానానికి పుణ్యం రావడమనే ప్రతిఫలాన్నాశిస్తున్నారు మీ అమ్మలాంటి వాళ్ళు— అందువల్ల ఎవరికి దానం చేస్తే ఎక్కువ పుణ్యం వస్తుందో బేరీజు వేసుకుంటున్నారు— అందుకు దేవుని ఏజెంట్లుగా కనబడే వాళ్ళే దగ్గరి మార్గంగా భావిస్తున్నారు— నిజానికి యాచకులెవరైనా ఆకలున్నవాడికి దానం చేస్తేనే పుణ్యమంటూ వచ్చేదుంటే ఎక్కువొస్తుంది—"

బాబు తన మాటల నర్థం చేసుకుంటున్నాడో లేదో అని కూడా ఆలోచించకుండా చెప్పాడు విజయకుమార్.

తండ్రి మాట లాదిత్యకు అర్థమయే కానట్టున్నాయి....స్కూలు నుంచి కవిత వచ్చి తండ్రి ప్రక్కనే కూర్చుంది.

మగ్గురికీ బోర్న్‌విటా కలిపి తెచ్చి టీపాయ్ మీద పెట్టింది కమల.

"ఏసి పిల్లగానికి మంచి పాఠాలే చెప్తున్నారు— వాడు మీ మాటలు విని పెరిగితే ఒంటిమీది బట్టలు కూడా ఒలిచిస్తాడు...." అంది భర్తతో.

"నీకంత భయపడక్కర్లేదు లేవోయ్....? స్వార్థం, మోసం, దగా- అన్నీ ఈ సమాజమే నేర్పుతుంది.... మన వరకు మనం మంచి నేర్పుదాం—" అన్నాడు విజయకుమార్.

"మీ మాటలే నా కర్థం కావు— నోది—" అంటూ లోపలకు వెళ్ళిపోయింది కమల.

"పెద్దలే చెబుతారు .... అదే చేస్తానంటే అడ్డుకుంటారు.... ఎందుకు నాన్నా— ?"

ఆదిత్య ప్రశ్న సూటిగా తగిలింది విజయకుమార్‌కు.

"అప్పుడు బాబూ! అది మా తరంలో వున్న దౌర్భాగ్యం....ఈసమాజంలో వున్న దౌర్బల్యం— నీతులు-మాటలు చెప్పేవరకే కాని, ఆచరణకొచ్చేసరికి చాలా మంది విషయంలో శూన్యమవుతున్నాయి.... ఈ సమాజ స్వరూప స్వభావాలనర్థం చేసుకునే వయసు నీకింకా రాలేదు— ప్రశ్నించడమనే నీకున్న అలవాటు నలాగే కొనసాగనియ్యి— కీపిట్ అప్—" అంటూ లేచి తన గదిలో కెళ్ళిపోయాడు విజయకుమార్.

మంచంలో పడుకొని ఆలోచనలో పడ్డాడు... అతనికి బాబు తరంపై నమ్మకముంది.... ఆశా వుంది.... వాళ్ళు తన తరంలా తలలూపడంలేదు....పెద్దలనైనా సరే నిలదీసి అడుగుతున్నారు— అందుకే బాబు తరం అతనికి ప్రశ్నించే తరంలా కనబడుతుంది.

ప్రశ్నించడం నేర్పడం పెద్దల బాధ్యత— మరి ఎంతమంది తల్లిదండ్రులు తమ పిల్లలకు ప్రశ్నించడం నేర్పుతున్నారు— ?

తనను తను ప్రశ్నించుకున్నాడు విజయకుమార్ — "చెప్పింది చేసే సమాజాన్ని నిర్మించే కాలం మీ చేతుల్లో — మీ తరం చేతుల్లో వుంది బాబూ...."

తనలో తానే గొణుక్కున్నట్టనుకున్నాడు విజయకుమార్.

## స్వీకారం :

1. దేవరాజు మహారాజు కథలు- 212 పేజీలు రు. 48-00. జీవన ప్రచురణలు. హైదరాబాదు- ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్నిశాఖల్లో.

2. వెదురు వనాల గానం- పాటలూ, కవితలూ. రచన : నూతన్. 110 పేజీలు. వెల రు. 10-00. విరసం సిటీ యూనిట్ ప్రచురణ- ప్రతులకు : నవోదయ బుక్ హౌస్. ఆర్య సమాజ్ ఎదురుగా- కాచిగూడ- హైదరాబాదు.

3. ఆధునికత- అత్యాధునికత. డా॥ అఫ్సర్ వ్యాసాలు. 90 పేజీలు. రు. 12-00. గాయత్రీ ప్రచురణ- తెనాలి. ప్రతులకు : పి.వి రమణ, గాయత్రీ ఫోరం. టి.బి.రోడ్, తెనాలి; విశాలాంధ్ర అన్ని బ్రాంచిల్లోనూ-

4. రాజుకోడి- ఆధునిక భేతాళకథలు. కాలువ మల్లయ్య 116 పేజీలు. వెల రు.15—00. అభ్యుదయ ప్రచురణలు, కాశ్మీర్ గడ్డ- కరీంనగర్. ప్రతులకు : నవోదయ, హైదరాబాద్; విశాలాంధ్ర అన్ని శాఖల్లోనూ.

5. రగిలే గుండెలు- కవితా సంకలనం- రంగు సత్యనారాయణ. 68 పేజీలు. రు 10-00. నవ్య పబ్లికేషన్స్. జనప్రియ గుట్ట. హైదరాబాదు-500037

6 అభ్యుదయ అరసం రాష్ట్ర మహాసభల ప్రత్యేక సంచిక (జనవరి-మార్చి 93) పేజీలు 8). రు. 6-00.

7. సగం సగం వ్యతిరేకతా! సంపూర్ణ యుద్ధమా? (వ్యాసం) డంకెల్ ప్రతిపాదనలలో గుట్టు : 32 పేజీలు. 2-00 జనంసాక్షి ప్రచురణలు. భార్గవ. 40-644 ధర్మపేట- కర్నూలు.

8. బుద్ధ బోధ- బౌద్ధమతం. డా॥ నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు 112 పేజీలు రు. 12-00. జనత పబ్లికేషన్స్- జె.కె.సి నగర్ గుంటూరు. ప్రతులకు : మైత్రీబుక్ హౌస్. కారల్‌మార్క్స్ రోడ్- విజయవాడ-2

9. పాంథశాల. మధురాంతకం రాజారాం కథలు. పేజీలు 126. వెల ప్రచురించలేదు. ప్రతులకు : కోణార్క పబ్లిషర్స్- 21/542 భాష్యకార్ల వారివీధి పెద్ద బజారు- నెల్లూరు-5:4001

10. ఒక నేపథ్యం- పది గొంతుకలు- (కమిటీ సంపుటి, కమాఖ్య: సమాఖ్య, విరసం ప్రకాశంజిల్లా ప్రచురణ, పేజీలు 18 వెల రూ. 3-00 ప్రతులకు : సజ్జా వెంకటేశ్వర్లు, S/o చెంచమ్మ, జయలక్ష్మి టాకీసు దగ్గర, పేటపాలెం-523187



## డంకెల్ మా కద్దురా

డంకెల్, డంకెల్, అంటూ
మా బొక్కలు కొరికావ
రైతు కూలి కష్టాన్ని, దోచుకొని పోతావా
డంకెల్ మా కొద్దురో, నీ దోపిడి ఆపరా
అణు బాంబుల అమెరికోడా
ఈ భూమి మాదిరా ||డంకెల్||

నాణ్యమైన వంగడాలు
దిగుబడులు అధిక మంట
మేలు రకం విత్తనాలు
గొప్పదనం నాదంటు
పండించె పంట మీద పెత్తనం నాదంటు
డంకెల్ ప్రతిపాదనంటు, ఒప్పందం అంటున్న
మనిషి తినే తిండి మీద
ఆంక్షలు విధి ఇస్తావ ||డంకెల్||
నిషేధించే విత్తనాలు
మాకు నీవు పంపుతావు
నిషేధించే పురుగు మందు
మాకు నీవు పంపుతావు / పురుగేమో చావ దాయె
పంటేమో పండదాయె
రైతుకూలి శ్రమనంత దోచుకోని పోతావు
డంకెలని, రంకె లేసి, మా బతుకులు కూల్చుతావా ||డంకెల్||
నిషేధించే ఫ్యాక్టరీలు, మా దేశంలోన పెట్టి
భోపాలు రాష్ట్రంలో, గ్యాసు లీకేజి వచ్చి
వేలాది కార్మికుల ప్రాణాలు బలికొన్నావ్
ప్రాణ నష్ట పరిహారం ఇంత వరకు ఇవ్వలేదు
భోపాల్ ఘోరము ఇంక మేము మరువలేము ||డంకెల్||

వియత్నాం చేతిలోన చిత్తు చిత్తు అయినావు
ఆయుధాల పేరుతో, అణుశక్తిని పెంచినావు
అగ్రరాజ్య అహంకారి, [illegible] పోస్తున్నావు
చిన్న పెద్ద దేశాలు ఐక్యమై తిడుతారు
దేశ ప్రజలు ఏకమౌతారు, నీ దోపిడి కూల్చుతారు

— ఎ. చలపతి

# పిల్లల ప్రపంచం

నిర్వహణ : పి. చంద్రశేఖర్ ఆజాద్ APSTC Ltd., డి. స. ఎమ్. ఎస్. [illegible], ఎస్. ఆర్ పేట, ఏ[illegible]

పిల్లలూ -

ఎదురు చూస్తున్న మంచి క్షణం వచ్చింది. ఈ నెల నుండి వివిధ రంగాల్లో కృషి చేస్తున్న పెద్దల అనుభవాలు మీరు చదవ బోతున్నారు. ముందుగా శ్రీనటరాజ్ అంకుల్ ఏం రాశాడో చదవండి. ఆ అంకుల్ కథలూ-నవలలూ రాశారు. ఇటీవల 'చిన్నారి పాపలు' అనే కరపత్రం నెల నెలా విడుదల చేస్తున్నారు.

'మరపురాని పాప' నవల వాళ్ళ అమ్మాయి 'సుజన'దే. తనిప్పుడు లేక పోయినా ఆ 'పాప' జీవించే ఉంది- ఆ పుస్తకం ద్వారా. అంటే పుస్తకాల వల్ల రచయితలూ, కవులూ, అలానే తమ కళలవల్ల కళాకారులు చనిపోయినా బతికే ఉంటారు. అందుకే మీలో ప్రతి ఒక్కరూ వీటన్నింటినీ బాగా పరిశీలించాలి.

మీ నుండి మహా రచయిత్రులూ, కవయిత్రులూ రూపొందాలి.

అందుకే ఈ పెద్దలందరితోపాటు మీరూ మీ ఊహల్ని రాసి పంపించండి.

## 30 సంవత్సరాల తర్వాత

అవును. 30 సంవత్సరాల తర్వాత అంటే 21వ శతాబ్దంలో సమాజం ఎలా వుంటుందని మీరు ఊహిస్తున్నారు. అప్పుడు పెద్ద వాళ్ళవుతారుగా - మీరేం చేయాలను కుంటున్నారు?

మీరేం స్వయంగా రాసి నాకు పంపించండి.

పెద్దల గురించి మీరు తెలుసు కుంటున్నట్లుగానే-మీ గురించి పెద్దలు తెలుసు కుంటారు.

పదో తరగతి చదువుతున్న వారి వరకూ ఈ శీర్షికలో పాల్గొనవచ్చు.

మీరేం చదువుతున్నదీ-ఏ బడిలో చదువుతున్నదీ కూడా రాయండి. ఇంక మీ అందరికీ అభినందనలు అందచేస్తూ -

మీ

మావయ్య

## సాహిత్య వేత్తలకూ, కళాకారులకూ మనవి

(ఈ శీర్షికకు కొన్ని పరిమితులున్నాయి. 'మీరిలా రూపొందటం వెనక ఏ వయసులో ప్రేరణ కలిగింది? అందుకు కారణం వ్యక్తులా? కుటుంబమా? ప్రకృతా? సంఘటనలా? ఏమిటి? ఈ విషయాలు రాయాలి. పేజీ నుండి ఒకటిన్నర పేజీవరకూ పత్రికలో ఈ శీర్షికకు కేటాయించిన పేజీల్లో అన్నీ రావాలి. అందువల్ల తప్పనిసరి పరిస్థితుల్లో ఎడిట్ చేయటం జరుగుతుంది.

ప్రారంభించే ముందు ఇంకో విషయం చెప్పాలి. నా దగ్గర చిరునామాలు ఉన్నంత వరకూ వ్యక్తిగతంగా లేఖలు రాస్తున్నాను. అలా రాయక పోయినా మన అనుభవాలు మన పిల్లలకు ఉపయోగ పడతాయని బాధ్యతతో, అనుభూతితో ఈ శీర్షికను ముందుకు తీసుకువెళ్ళాలని అందరికీ మనవి చేస్తున్నాను. నటరాజ్ ఇలా అంటున్నారు. "దఫ దఫాలుగా ఆ రెండు పేజీలూ పూర్తి చేసి మీకు పంపిస్తున్నాను. రాసింది రెండు పేజీలే అయి పదే పదే చదువుకుంటూ, మా ప్రియమైన మాస్టార్లని తలుచుకుంటూ, చాలా సార్లు కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకున్నాను." కాగా పిల్లలకు మన అనుభవాలు వివరించటం అంత సులభమైన విషయం కాదు. చాలా మథ్యన పడాలి. బాల్యంలోకి జారాలి. ఆ జ్ఞాపకాలను మన పిల్లలకు అందించాలి. మీ మీ ప్రతి స్పందనలకై ఎదురు చూస్తుంటాం.)

## యిప్పుడూ - నా చిన్నప్పుడూ!

నాకు చిన్నప్పుడు చెరువుల్లో కాలవల్లో స్నానాలు చేయటమంటే భలేయిష్టంగా ఉండేది. అలాచేసినట్టు తెలిస్తే మానాన్నగారు చావగొట్టేవారు. చెట్లూ, పొలాలూ, పాడుబడ్డ గుళ్ళూ, పావురాళ్ళూ, పాలపిట్టలూ....వోహ్! అదంతా ఒక గొప్ప అద్భుత ప్రపంచం. సర్వం మరచేవాళ్ళం. ఇప్పుడు ఆ చెట్లూ లేవు. ఆ చెరువులూ లేవు. ఆ కేరింతలూలేవు. పెద్దవాళ్ళ కోరిక ఇలా యీడేరింది. వారికి కావలసిందల్లా చదువు, చదువు వొకపే రోకటి చదువు. బండ చదువు. మొండి చదువు. అంతే. పిల్లల మనోభావాల పట్లా, ప్రకృతిపట్లా వారికెప్పుడైనా ఆసక్తి ఉంటే కదా! పిల్లలకి ఆనందమూ, స్వేచ్ఛా, కేరింతలూ-యివన్నీ వారి దృష్టిలో సామాజిక నేరాలు. చదువు పేర, క్రమ శిక్షణపేర వారి పసి మనసుల్ని నలిపేసి, వారిని హీనులుగా జీవన దరిద్రులుగా చేయడమంటే వారి కదొక తప్పనిసరిగా నెరవేర్చవలసిన సామాజిక బాధ్యత. ఆ బాధ్యతని వారెంత పకడ్బందీగా నిర్వహిస్తారనీ! వాళ్ళ దెప్పుమా 'పిల్లలు చెట్లూ పుట్టలు పట్టుకొని పాడై పోతున్నారు. వాళ్ళని అడపా దడపా నాలుగు తన్నకపోతే యింకా పాడైపోతారు' అన్న దృష్టే. ముప్పయేళ్ళ క్రితమూ అంతే. ఇప్పుడూ అంతే.

అందుకే పెద్ద వాళ్ళు అరళ్ళూ, బాధలా పడలేక పిల్లలు ఇప్పుడు రౌడీ సంస్కృతి అంటే చాలా మోజుపడుతున్నారు. పిల్లలిలా తయారు కావటానికి ఇంట్లో పెద్దలే కారణమని అక్కసుగా చెబుతాను. పిల్లల్ని సత్యశోధకులుగా పెంచలేని తల్లిదండ్రులకన్నా పశువులూ, పక్షులూ చాలా మేలని యీ దారుణమైన విమర్శని అత్యంత ధృఢంగా చేస్తాను. అటువంటి వారిని పిల్లల్ని కనకుండయ్యా బాబు అని చేతులెత్తి మొక్కుతాను-చిన్నప్పుడు మా మాస్టార్లు పాఠాలు ఎంత బాగా చెప్పే వారనీ! సిద్ధార్థుడి కథలూ, డెఫొడిల్స్ పువ్వుల కథలూ, స్కైలార్క్ పక్షుల కథలూ, చానమ్మ, రుద్రమ్మ, నాగమ్మ, ఝాన్సీ లక్ష్మీబాయి కథలు చెబుతుంటే ఆ కొత్త ప్రపంచాన్ని అనుభవిస్తూ గుండె అంతా పుప్పొంగి పోయేది. కరుణ రసం పొంగి నప్పుడు ఆ ఉద్వేగం భరించలేక ఒకోసారి వెక్కి వెక్కి ఏడ్చేసేవాళ్ళం. ఆ మాస్టార్లే మాకా కారుణ్య పాఠాలు, మా హృదయాలు ద్రవించేట్టుగా చెప్పి, మా హృదయాలలో ప్రేమానురాగాల చైతన్యాన్ని రగల్చకపోతే మా గుండెల నిండా ఆ కమనీయమైనమానవతా వెలుగులు నింపక పోతే, మేము హీనులుగా, ఇతరుల్ని నిందిస్తూ, యేడ్పుగొట్టు మొఖాలతో బతుకీడుస్తూ ఉండే వాళ్ళం.

యీనాడు నేనిలా నలుగురిలో నాదంటూ ప్రత్యేకమైన మంచి బతుకు బతుకుతూ, కష్టాల్ని అధిగమిస్తూ, సత్యాల్ని శోధిస్తూ, మార్పుల్ని ఆహ్వానిస్తూ, మారుతూ ఆశావాదంతో బతుకుతున్నానంటే-రచనల ద్వారానో-కార్యక్రమాల ద్వారానో ఏదైనా సేవ చేయగలుగుతున్నానంటే అది ఆనాటి మా మాష్టార్ల కారుణ్య బోధనల ఫలితమే అని పూర్తిగా నమ్ముతున్నాను. యీ ఆనందానికీ, ఆశావాదానికీ కారణమైన మా మాష్టర్లను తలుచుకుంటే వళ్ళంతా పులకరించి, గుండె అంతా చలించి కళ్ళమ్మట నీళ్ళు వచ్చేస్తాయి.

"వారి రూపాలేగాని వారి పేర్లు తెలియవనీ, అస్సలు జ్ఞాపకం లేవనీ చెప్పా లంటే నాకు మరీ ఏడ్పు వస్తుంది." ఆ మాష్టార్లలో చాలామంది ఇప్పటికి చనిపోయే ఉంటారు. వారు వెలిగించిన జ్ఞాన దీపాలు జీవితాంతం నాలోనూ మా నుండి ఏమైనా నేర్చుకునే వారిలోనూ అజరామరంగా వెలుగుతూనే వుంటాయి. తల్లితండ్రులు అటు వంటి ఉపాధ్యాయులు ఎందుకు అవ్వడం లేదు? కనీసం పిల్లలతో కలసి దొమ్మరిళ్ళూ, పిచ్చుకగూళ్ళూ కడుతూ వారితో పాటు గెంతులు వేసే తల్లిదండ్రులు కావాలి మన కిప్పుడు.

అవ్యాజమై ప్రేమానురాగాలూ అంతట్లోనే మరిచిపోయే శత్రుత్వాలూ.... యేవీ....మనకిప్పుడు యేవీ ?

— నటరాజ్

రచయిత, స్వాప్నికుడు

ఉత్పల్ దత్ సంస్మరణ :

# సామాజిక స్పృహగల నటుడు ఉత్పల్ దత్

— డా. ప్రభాత్

"రంగస్థలంపై నటించకుండా నేను ఎలా జీవించగలను?" అన్న ఉత్పల్ దత్, చివరి దశ వరకూ నటనలో నైపుణ్యాన్ని అభివృద్ధి పరచుకుంటూ, 19 ఆగష్టు 1993 న, కలకత్తాలో మరణించాడు. చాలా కాలంగా మూత్రపిండాల వ్యాధితో సతమతమై తరచుగా డయాలిసిస్ చేయించుకుంటూ, చివరిసారిగా డయాలిసిస్ చేయించుకొని ఇంటికి తిరిగి వచ్చి, గుండెపోటుతో మరణించాడు. రోగిగా వున్నా కూడా, చలన చిత్రాల్లో, నాటకాలలో నటించటం ద్వారా, అధ్యయనం చేయడం ద్వారా కాలం గడిపాడు. చనిపోవడానికి ఒక పక్షం రోజుల ముందు—ఆగస్టు 3 న తాను నిర్మిస్తున్న చిత్రం "ఏక్లా చలోరే ! (ఒంటరిగా సాగిపో) లో నటించాడు. ఆయన కుమార్తె విష్ణుప్రియ పాల్ దీనికి దర్శకురాలు. తరుణ్ మజుందార్ చిత్రంలో జనవరిలో నటించడానికి అంగీకారాన్ని తెలియ చేసాడు.

గత నాలుగు దశాబ్దాలుగా వామపక్ష సిద్ధాంతాన్ని నటునిగా, దర్శకునిగా, నాటక రచయితగా, నిర్మాతగా ప్రచారం చేసిన ఉత్పల్ దత్ 1929 మార్చి 29న. పుట్టే నాటికి వామపక్ష ఉద్యమం ఒక సంఘటిత శక్తిగా లేదు. ఆయన కలకత్తాలో షిల్లాంగ్‌లో చదువు పూర్తిచేసే సమయానికి వామపక్ష ఉద్యమం వూపందుకుంది. అభ్యుదయ రచయితల సంఘం, ఇప్టా చాల చురుకుగా పని చేస్తున్నాయి. వీటితో ఉత్తేజితుడై ఉత్పల్ దత్ ఇప్టాలో 1952 లో చేరాడు. పార్టీ నిషేధానికి గురైన సమయంలో, దాని సభ్యులు రాజకీయ శత్రువుల దాడిని ధైర్యంగా ఎదుర్కొన్న వాస్తవమే తనను ఇప్టా వైపు, పార్టీ వైపు ఆకర్షించాయని చెప్పారు. ఆ తర్వాత ఆయన వెనుదిరగలేదు. వామపక్ష రాజకీయ ప్రచారానికి రంగస్థలాన్ని ఒక సాధనంగా ఉపయోగించుకున్నాడు. మార్క్సిజం విఫలమైందని ఆయన తలచలేదు.

ఉత్పల్ దత్ తండ్రి ఇంగ్లీషు ప్రొఫెసర్. ఉత్పల్ ఒక దొరబాబుగా తన జీవితాన్ని ప్రారంభించాడు. తన 14 వ ఏట విద్యార్థిగానే షేక్స్పియర్ నాటకం 'హామ్లెట్' లో ఒక చిన్న పాత్ర ధరించాడు. ఆ తరువాత ప్రముఖ నటుడు కెండాల్ గ్రూపులో చేరి ఇండియా, పాకిస్తాన్‌లలో 47-48 సంవత్సరాల్లో పర్యటించాడు. జెఫ్రీ కెండాల్ షేక్స్పియానా బృందంలో పని చేసిన అనుభవంతో ఎన్నో షేక్స్పియర్ నాటకాలలో నటించాడు - వాటికి దర్శకత్వం వహించాడు.

బెంగాలీ భాషలోకి అనువదించి షేక్స్పియర్ నాటకాలను ప్రదర్శించి తన 'బార బాబు' ఉచ్చారణను హేళన చేసిన వారు నివ్వెర పోయేట్లు చేశాడు.

కలకత్తాలోని ఇంగ్లీషు నాటకాలనుంచి బయటపడి తన మాతృభాషలో కృషి చేయాలని నిశ్చయించుకున్న ఉత్పల్ దత్ '19 వ శతాబ్దపు తిరుగుబాటు కవి, ఆంగ్ల రచయితా మైకేల్ మధుసూదన దత్ పై ఆయన మొట్టమొదటి సినిమా నిర్మించాడు. మైకేల్ పాత్రలో ఉత్పల్ దత్ - సరిగ్గా ఇంగ్లీషు భాషా వ్యసనం నుంచి బయటపడే పాత్రలో.... తానూ అదే స్థితిలో వున్నాడు గనుక సరిగ్గా అతుక్కుపోయాడు. ఆ తర్వాత మైకేల్ మధుసూధన దత్ రచించిన ఒక పార్సు (ప్రహసనం ?) లో ఉత్పల్ దత్, యువతులపై లైంగిక దాడులు చేసే క్రూరుడైన వృద్ధ జమీందార్ పాత్ర వేశాడు. ఆ పాత్రలో ఆయన నటన అద్భుతమన్నారు విమర్శకులు. మరొక ప్రముఖ బెంగాలీ రంగస్థలకళాకారుడు శంభు మిత్ర మార్క్సిస్టుగా థియేటర్ ఉద్యమంలో ప్రవేశించి - ఇప్టా ఆధ్వర్యంలో 'నవాన్న' నాటకాన్ని ప్రదర్శించి, ఆ తర్వాత పరిశుద్ధ థియేటర్ (Pure theatre) వాదంపై ప్రయాణించగా, ఉత్పల దత్ నటుడిగా ప్రవేశించి చాల ఆలస్యంగా మార్క్సిజం వైపుకు వచ్చాడు. ప్రపంచంలో వివిధ ప్రాంతాల్లో సోషలిస్టు దేశాల వైఫల్యాలు ఆయనకు మార్క్సిజం పట్లగల విశ్వాసాన్ని ఏ మాత్రం సడలింప చేయలేకపోయాయి.

ఇప్టా నుంచి ఉత్పల్ దత్ తన స్వంత నాటక బృందాన్ని నిర్మించుకున్నాడు. 1954 నుంచి 1969 వరకు దానికి 'లిటిల్ థియేటర్' గ్రూపు అనే పేరుండేది. ఈ కాలంలో 2 నాటకాలు ఈ బృందం ప్రదర్శించింది. 1967 - 68 - 69 సంవత్సరాలలో నక్సలైట్ సానుభూతి పరుడిగా, సి. పి. ఎమ్ ను వ్యతిరేకిస్తూ నాటకాలు రాశాడు. వీటిలో ఒక నాటకం 'తీర్' (బాణం) అయితే ఆయన ఆ తర్వాత ఆ నాటకాన్ని ఉపసంహరించు కుంటున్నానని (disown) ప్రకటిస్తూ, తప్పుడు రాజకీయాలు వున్న కళా ప్రక్రియ ఎంత గొప్పదైనా సరే సరైనదిగా పరిగణించడం సాధ్యంకాదు" అన్నాడు.

1965 లో ఈయన రాసి ప్రదర్శించిన "కల్లోల్" నాటకానికి కథా వస్తువు 1946 నాటి రాయల్ నౌకాదళ తిరుగుబాటు. ఈనాటకం కలకత్తాలోఒక కల్లోలాన్ని సృష్టించింది. తిరుగుబాటుదార్లను కాంగ్రెసు బలపరచకుండా మోసం చేసింది అన్న సూత్రీకరణ కాంగ్రెసువారికి నచ్చలేదు. కాంగ్రెసువాదు నాటక ప్రదర్శనపై దాడి చేశారు. 'అంగార్' (1959) నాటకం ఒక గనిలో నీరు ప్రవేశించి బొగ్గుగని కార్మికులు మరణించటాన్ని చిత్రిస్తుంది. రంగస్థలంలో అది ఒక వినూత్నమైన ప్రక్రియ. తపస్ సేన్ లైటింగ్ ద్వారా గనిలోకి నీళ్ళు రావటాన్ని చిత్రించిన దృశ్యం నిర్మల్ గుహారే సెట్ డిజైన్లు, బెంగాలీ రంగస్థల చరిత్రలోనే అపూర్వమైనవి - అనుపమైనవి.

లిటిల్ థియేటర్ గ్రూపు బానర్‌పై షేక్స్పియర్ నాటకాలు 'ఒథెల్లో' 'హామ్లెట్', [illegible] బెర్నార్డ్ షా నాటకం 'ఆర్మ్స్ అండ్ ది మాన్'- క్రిస్టఫర్ ఒడెట్ నాటకాల[illegible] బెంగాలీ భాషలో [illegible] ప్రదర్శించాడు. ఇష్టా ఇచ్చిన [illegible] రచనలు '[illegible]', 'అచల యాతన' లు నాటకాలుగా తయారు చేశాడు. గిరీశ్ చంద్ర ఘోష్ రాసిన 'సిరాజుద్దౌలా', మైకేల్ మధుసూధన దత్ రాసిన ప్రహసన 'బుడో షాలికర్ ఘడే రో'-నాటకాలను ప్రదర్శించాడు.

1959 లో కలకత్తాలోని మినర్వా థియేటర్‌ను ఆయన తీసుకున్నాడు. ఆ రంగ స్థలంపై తానే నాటకాలు రాసుకొని, తానే దర్శకత్వం వహించి పుంఖాను పుంఖాలుగా నాటకాలను ప్రదర్శించాడు. అవన్నీ ఉన్నత సామాజిక, రాజకీయ స్పృహ కల్గివుండేటట్లుగా తీర్చి దిద్దాడు 'జూలియస్ సీజర్' నాటకాన్ని ఆధునిక దుస్తులు ధరించే పాత్రలతో రూపు దిద్ది ఆశ్చర్యపరిచాడు 1952 లోనే ఆయన 'ది మర్చంట్ ఆఫ్ వెనిస్', ఇబ్సన్ రచన 'ఎ డాల్స్ హౌస్' బెంగాలీలోకి అనువదించి ప్రదర్శించాడు.

రంగ స్థలంపై అత్యధిక సంఖ్యలో నటులను ప్రవేశపెట్టడమనే ప్రయోగాన్ని ఉత్పల్ దత్ ధైర్యంగా చేశాడు. తీతాస్ ఏక్తీ నదీర్ నామ్' నాటకంలో స్టేజీ ఆడిటోరియం ముందుకు చొచ్చుకు వచ్చేట్లు ఒక ప్రయోగం చేశాడు.

ఇంకా ఆయన నాటకాల్లో కొన్నిటి గురించి చెప్పుకోవాలంటే ముందు ప్రస్తావించవలసింది. 'మనుషేర్ అధికార్' (మానవ హక్కులు) అనే నాటకం. దీనిలో అమెరికాలోని జాతి వివక్షా విధానాన్ని సునిశితంగా విమర్శించాడు. 19 వ శతాబ్దానికి చెందిన నాటక రచయిత ఒకడు కలకత్తా సీధుల్లో [illegible] తిరుగుతూ, మురుగుకాల్వ బాగుచేసే కార్మికుడికి 'మేఘనాద్‌బధ్' కావ్యం వినిపించడం కథా వస్తువుగా వున్న నాటకం "టీనేర్ తల్వార్" (రేకు కత్తి), 'మహా' (మహా విద్రోహం) అనే నాటకంలో 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ పోరాటాన్ని చిత్రించాడు. 'దుస్వప్నేర్ నగరి' లో కలకత్తా జీవితాన్ని చిత్రించాడు.

బెంగాలీ న్యూథియేటర్ ఉద్యమంలో భాగంగా ప్రేక్షకులకు తండోప తండాలుగా నాటకాలు చూడటానికి వచ్చేట్లు చేయడంలోనూ మినర్వా థియేటర్‌లో క్రమబద్ధంగా నాటకాలను ప్రదర్శించడంలోనూ ఆయన సాధించిన విజయం అనితర సాధ్యం.

[illegible] గాక ఆయన 16 వీధి నాటకాలూ, పోస్టర్ నాటకాలూ రాసి దర్శకత్వం వహించాడు 196[illegible] - 88 మధ్య 21 జాత్రాలను (బెంగాల్ జానపద [illegible] ప్రక్రియ) ప్రదర్శించాడు.

'కల్లోల్' నాటకం సందర్భంగా అరెస్టయి, ఆరు నెలలు విచారణ లేకుండా డిటైన్ చేయబడ్డాడు ఉత్పల్ దత్

నాటక రంగం నుంచీ సినిమా రంగంలోకి ఆయన మృణాల్ సేన్ మొదటి హిందీ సినిమా 'భువన్ షోమ్' ద్వారా ప్రవేశించాడు. దానిలో అవినీతిపరుడైన రైల్వే స్టేషన్ మాస్టరుగా నటించి మొదటిసారిగా బెంగాల్ బయట వున్న ప్రేక్షక లోకానికి పరిచయమయ్యాడు. 1975 లో సత్యజిత్ రే 'జనారణ్య' సినిమాలో ఉత్పల్ దత్ నిరుద్యోగులకు అవకాశ ప్రాముఖ్యమైన చిన్నదైన ఒక చిన్న వ్యాపారస్తుని పాత్ర పోషించాడు. ఎన్నో హిందీ సినిమాల్లో కామిక్ విలన్ పాత్ర పోషించి మెప్పించిన ఉత్పల్ దత్ గంభీరమైన పాత్రను కూడా అంత గొప్పగా మెప్పించ గలడని సత్యజిత్ రే చివరి చిత్రం 'ఆగంతుక్'లో ఆయన నటన రుజువు చేసింది. గౌతమ్ ఘోష్ చిత్రం 'పద్మ నదీర్ మాఝి'లో కూడా ఆయన అద్భుతంగా నటించాడు. ఆయన సినిమాలలో వాడుక భాష వాడటానికి ప్రాముఖ్యత నిచ్చాడు మాండలీకాలపై ఆధిపత్యం సంపాదించాడు 'కలకత్తాలో వుంటే అఖిల భారత దృష్టికోణం ఏర్పడడం అసాధ్యం. బొంబాయి సినిమా రంగంలో ప్రవేశించడం ద్వారా దేశవ్యాప్తంగా సంబంధాలు వస్తాయి. అవగాహన కల్గుతుంది'కనుక ఆయన హిందీ సినిమా రంగంలో ప్రవేశించాడు.

"సినిమాలన్నీ విజయవంతం కావు. నేను నటించిన సినిమా పేర్లు నేను గుర్తు పెట్టుకోను. ఆయా సినిమాల్లో నా కర్తవ్యం నేను నిరవేర్చుస్తాను. అంతే. ఉదాహరణకు బాంకులో కాషియర్ రోజంతా నోట్ల కట్టలతో - లెడ్జర్ తో పని చేస్తుంటాడు. ఆ రోజు డ్యూటీ అయిపోయిన తర్వాత లెడ్జర్ లో అంకెలనుఆయన గుర్తు పెట్టుకోడు. నేనూ అంతే." అనే వాడు ఉత్పల్ దత్.

నటనపై ఆయన రూపొందించిన ఒక ఆసక్తిదాయకమైన మార్క్సిస్టు సిద్ధాంతం వుంది. ఆయన ఉద్దేశం ప్రకారం నటన అనేది "ఒక గతి తార్కికమైన కార్యక్రమం" (dialectical business).

"నటుడు ఏ పాత్ర ధరిస్తున్నాడో, ఆ పాత్ర హృదయంలోని భావాలను నటుడు ప్రేక్షకులందరికీ వినబడేట్లు గట్టిగా చెప్తాడు. నిజానికి ఆ సంభాషణలన్నీ నటుడు ముందే నోటికి నేర్చుకుంటాడు. అయితే వాటిని అప్పటికప్పుడు వచ్చిన వాటిలాగా చెప్పాలి. ఇదొక వైరుధ్యం. ఈ వైరుధ్యంపై సరైన అవగాహన, అధికారం మార్క్సిస్టు గతి తర్కమే నటునికి ఇవ్వగల్గుతుంది. లేకపోతే నటుడు ఈ వైరుధ్యంలో కొట్టుకు పోతాడు. వైరుధ్యాన్ని పరిష్కరించుకోలేక, ప్రదర్శనను నాశనం చేస్తాడు." అని తన సిద్ధాంతాన్ని ఉత్పల్ దత్ వివరించాడు.

'షేక్స్పియర్ లోని సామాజిక స్పృహ', 'స్టానిస్లావస్కీ పైన', 'విప్లవ రంగస్థలం పై పుగా' అనే పుస్తకాలు రాశాడు. తూర్పు యూరప్ దేశాల పరిణామాల గురించి ఆయన రాసిన పుస్తకం 'ప్రతి విప్లవ్' (ప్రతీఘాత విప్లవం) విడుదలకు తయారుగా వున్న సమయంలో ఆయన మరణించాడు. ●

# రాయలసీమ సమస్యలపై ఎన్సైక్లోపీడియా

—కొత్తపల్లి రవిబాబు

కరువుకు ఖచ్చితమైన నిర్వచనం ఇవ్వడం అసాధ్యం. వారి వారి దృక్పథాల బట్టి, దేశంలోని జీవన పరిస్థితుల బట్టీ, కాలాన్ని బట్టి ఆ నిర్వచనం మారుతూ వుంటుంది. ఆకలికి, అధిక ధరలకి గురై, తిన కూడని పదార్థాలు తినే పరిస్థితిని కరువు అనవచ్చు. మన దేశంలో వివిధ ప్రాంతాల్లో వివిధ రకాల వర్షపాతం, ఉష్ణోగ్రత వుంటుంది. కనుక దేశం మొత్తం కరువుకు గురయ్యే ప్రమాదం లేదు. ఆ పరిస్థితుల్లో ప్రభుత్వం మిగులు ప్రాంతాల నుండి ఆహారాన్ని కొరత ఏర్పడిన ప్రాంతాలకు తరలిస్తే ఆకలి చావులు వుండవు. కానీ పాలక వర్గాలు ఈ పని చేసి ప్రజలను రక్షించడానికి సిద్ధంగా లేవు. కనుకనే కరువులు వస్తుంటాయి.

బ్రిటిషు ప్రభుత్వం కరువు నివారణ స్మృతి (Famine Code) నొక దానిని నిర్ణయించింది. 1947 తర్వాత మన 'స్వతంత్ర' ప్రభుత్వం ఆ code ను రద్దు చేసింది. కరువును కరువు అని పిలవకుండా వర్షాభావ పరిస్థితులు అని ముద్దు పేరు పెట్టింది. ఫామిన్ కోడ్ ప్రకారం ప్రజలకు ఇవ్వాల్సిన కనీస సహాయాన్ని ఆ విధంగా ఇవ్వ నిరాకరిస్తోంది.

మన దేశంలో బ్రిటీషువారి హయాంలో 22 కరువులొచ్చాయి. ఇంకా ప్రాచీన చరిత్రలోకి పోతే కరువు కాటకాల ప్రస్తావన ఋగ్వేద, అథర్వణ వేదాల్లోనే కనిపిస్తుంది. క్రీ. పూ. బీహార్‌లో చంద్రగుప్తుని హయాంలో వచ్చిన తీవ్రమైన కరువు నుంచి నేటి రాయలసీమ, తెలంగాణా, కలహండి కరువుల వరకు ఎన్నెన్నో కరువులు— కొన్ని ప్రకృతి కోపించిన ఫలితంగా వచ్చినవైతే- మరికొన్ని పాలకులు కృత్రిమంగా సృష్టించినవి. మన దేశంలో వచ్చిన కరువులు ఎక్కువగా వర్షాభావం వల్ల వచ్చినవే. కనుక నీటి పారుదల సౌకర్యాలు కల్పిస్తే ఈ కరువు నుంచి విముక్తి కాగలం.

వర్షపాతం తక్కువై-మరింత తక్కువై, వాతావరణంలోని మార్పుల కారణంగా రాయలసీమలోని అనంతపురం జిల్లా ఏ చర్యలూ తీసుకోకపోతే ఏనాటికైనా ఎడారిగా మారక తప్పదని శాస్త్రవేత్తలు చెప్తున్నారు. కరువును నివారించలేకపోయారుగాని, ప్రభుత్వం వారు కమిటీలు, కమీషన్లు మాత్రం పుష్కలంగా వేశారు.

తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణాన్ని పూర్తి చేయడం, అప్పర్ పెన్నార్, ప్రాజెక్టు, వైరవాని తిప్ప ప్రాజెక్టు, హంద్రీ-నీవా ప్రాజెక్టు, లోయరు సగిలేరు ప్రాజెక్టు గండికోట ప్రాజెక్టు, కృష్ణా - పెన్నార్ ప్రాజెక్టు, సిద్ధేశ్వరం

ప్రాజెక్టు, పాత గండి కోట ప్రాజెక్టు, శ్రీశైలం ప్రాజెక్టు, కె. సి. కెనాల్ పునః నిర్మాణం మొదలగు వాటినెన్నో ప్రభుత్వం చేపట్టవలసిన కర్తవ్యంగా మిగిలివుంది.

వీటి గురించి తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలో వున్నప్పుడు కాంగ్రెసు వారు పెద్ద ఆందోళన ప్రారంభించారు. దానిలో స్వచ్ఛంద సంస్థలు, వ్యక్తులు గణనీయమైన కృషి చేశారు. ప్రస్తుతం కాంగ్రెసువారు అధికారంలో వున్నారు. కానీ పట్టించుకోవడం లేదు. రాజకీయ అధికారం కోసం పాకులాడటం తప్ప పార్లమెంటరీ రాజకీయ పార్టీల వారు రాయలసీమ ప్రజల బాధామయ గాధను సీరియస్‌గా పట్టించుకున్నవారే లేరు. ఎంతో సిగ్గు చేటైన విషయం ఇది.

రాయల నాటి కాలంలో వివిధ ప్రాంతాల్లో చెరువులు తవ్వించి వాటి ద్వారా నీరు నిలువ చేసుకొని వ్యవసాయం చేసుకొనేవారు. నేటి 'అభివృద్ధి' సాధించిన ప్రభుత్వాలు ఆ చెరువుల్లో నీటిని నిల్వ చేయలేకపోతున్నారు. ఈనాడు బావులు త్రవ్వి త్రవ్వి ఎంత త్రవ్వినా నీళ్ళు పడక రైతులు అప్పులపాలౌతున్నారు.

ధాత కరువుతో కళ్ళు తెరిచిన బ్రిటీష్ ప్రభుత్వం పలు రకాల పరిశోధనలు జరిపింది బ్రిటీషు ఇంజనీర్లు కాటన్, మెకంజీలు నీటి పారుదల సౌకర్యాలుకల్పించే అవకాశాల కోసం పరిశోధనలు ప్రారంభించారు. రాయలసీమలో సాగులో వున్న 75 లక్షల ఎకరాలకుగాను 39 లక్షల ఎకరాలకు నీటి పారుదల కల్పించే పధకాలను రూపొందించారు. కాటన్ రూపొందించిన (1890) కర్నూలు-కడప (K.C. కెనాల్) మూలంగా కర్నూలు జిల్లాలో 1 లక్ష, 84 వేల ఎకరాలు, కడప జిల్లాలో 94 వేల ఎకరాలు సాగులోకివచ్చాయి. అయితే కృష్ణ, తుంగభద్ర, పెన్నానదులను కలుపుతూ సర్ మెకంజీ రూపొందించిన బృహత్పధకం - రెండు ప్రపంచ యుద్ధాలవల్ల కార్యరూపం దాల్చలేదు. 1947 తర్వాత 'మన' ప్రభుత్వం పట్టించుకోలేదు. దీనిని చేబడితే 36 లక్షల ఎకరాలకు నీటి పారుదల ఏర్పడి వుండేది.

రిటైర్డు ఇంజనీరు, టుంకూరు వాస్తవ్యులైన పరమ శివయ్యగారు అప్పర్ తుంగ మరియు అప్పర్ భద్ర నీటిపారుదల పథకం, షట్ట కనుమ బ్యాలెన్సింగ్ రిజర్వాయర్, చిత్తూరు జిల్లాలో రిటైర్డు చీఫ్ ఇంజనీర్ యం. ఏ. తిరునారాయణ్ ప్రతిపాదనలు, రిటైర్డు ఇంజనీర్ పి. నారాయణప్ప పథకాలు, మొదలగునవి అమలు చేస్తే రాయలసీమ ఎడారి కాకుండా చేయవచ్చును.

కరువులకు ఆలవాలమైన రాయలసీమలో ఎంతో గొప్ప ఖనిజ సంపదవుంది. దీనిని ఉపయోగించుకొని పరిశ్రమలు అభివృద్ధి చేయడంలో కూడా ప్రభుత్వం విఫలమైంది. ఆస్‌బెస్టాస్ (రాతినార), బెరైటీస్ (ముగ్గురాళ్ళు), సున్నపురాయి, చైనాక్లే బంక మన్ను, నాపరాళ్ళు, పుష్కలంగా లభిస్తాయి. కాని వీటికి సంబంధించిన

(తరువాయి 68వ పేజీలో)

# నిజాయితీ లేని వాళ్ళం

శీలా వీర్రాజు

మనం మాటి మాటికీ ప్రజల గురించి మాట్లాడతాం
సమూహాల మధ్య మనల్ని మనమే నిలబెట్టుకుంటాం
కలల్లోకి కల్పనల్లోకి జారుకున్నంత తేలిగ్గానూ, సహజంగానూ
ప్రజల్లోకీ, సమూహాల్లోకి దూరిపోతాం
మన చేతిలో అక్షరాలున్నాయి/వాటిని మన చుట్టూ పాతుకుని
పూలు పూయిస్తాం, పళ్ళు పండిస్తాం
వాటి సువాసనల్నీ రంగుల్నీ వొంటి మీద చల్లుకుని
మనం పరిమళించిపోతాం పరవశించిపోతాం
మనకు కావలసింది యిదే
మన అక్షరాల్ని నాటుకోడానికి ప్రజలు కావాలి
అవి ఏపుగా ఎదగడానికి ఎరువులు కావాలి
ప్రజల కష్టాలు ఎరువులవుతాయి, కన్నీళ్ళు చెలమలవుతాయి
మన లక్ష్యం నెరవేరుతుంది
హాయిగా విలాసంగా విహరించడానికి /మనకు ఓ తోట సిద్ధమౌతుంది
అప్పుడు మనం తోటలోనూ, జనం తోట వెలుపలా
మనలో సుప్రాతిక సూవొంతుల మందికి
ఆ తోటని చూసుకుని మురిసిపోవడంతోనే సరిపోతుంది
మాటి మాటికీ మనకు మనమే గుర్తొస్తుంటాం
ప్రజలూ గుర్తురారు సమూహాలూ గుర్తు రావు / వస్తే—
బారుల్లో కూచుని విదేశీ సారాల్లో మునుగీతలు కొడ్తూ
ఇక్కడ పెల్లుబికిన సారా ఉద్యమం మీద
జోకులు కట్ చేసుకుంటూ విరగబడి నవ్వుకోం
సామ్రాజ్యవాద దేశాలు స్వార్థంకోసం చీల్చిన
జాతుల పునరేకీకరణకు భుజాలు ఎగరేసి
ఇక్కడ వేర్పాటువాద ధోరణుల్ని వీరోచిత కార్యాలుగా కీర్తించం
కమ్యూనిస్టు దేశాల్లో కేబరేల్నీ, బ్యూటీ క్వీన్ కంటెస్టుల్నీ నిరసిస్తూ
ఇక్కడ స్త్రీని అమ్మకం బొమ్మచేసి వ్యాపారం సాగించం
పీఠం కించే నుంచుని పాలకులకు చురకలు అంటించి
పదవుల కుర్చీ చూపగానే చంక లెగరేసుకు వెళ్ళి
ఠీవిగా బైఠాయించి అక్షింతలు వేసి ఆశీర్వచనాలు చల్లం
సంఘం మరమ్మతు బాధ్యతను స్వయంగా భుజాల కెత్తుకుని

కవిత్వం ఆయుధమని, కొరడా అని నిర్వచనాలు గుప్పిస్తూ
ఎవరి పెళ్ళికి వారే పెళ్ళి పెద్దయి కల్యాణాలకు బ్రీఫ్ కేసులు పట్టుకోం
మనం వొట్టి స్వార్థపరులం
మనకు కావలసింది ప్రజలు కాదు, మనమే
మన కీర్తి ప్రతిష్టలు, మన సుఖ సంతోషాలు, మన హోదాలు
ఆ తర్వాతే మనకు ప్రజలు

---

(66 వ పేజీ తరువాయి)

పరిశ్రమలు మాత్రం శూన్యం.

ఈ విషయాలన్నిటినీ కూలంకషంగా చర్చించిన దాదాపు 65 వ్యాసాలు ఈ పుస్తకంలో పొందుపరచబడ్డాయి. సహజంగానే 'కదలిక' సంపాదకులైన భూమన్, ఇమాంగార్ల వ్యాసాలు ఎక్కువగా వున్నాయి. రిటైర్డు చీఫ్ ఇంజనీర్ యం.ఏ. తిరునారాయణ్‌గారి మూడు వ్యాసాలూ, డా. యం.వి. రమణారెడ్డి 'రాయలసీమ కన్నీటి గాథ'-నాలుగు రాయలసీమ జిల్లాల్లో వున్న భూగర్భ జల వనరుల గురించి సుబ్రహ్మణ్యం రాసిన నాలుగు వ్యాసాలూ ఎన్నో కొత్త విషయాలనుతెలియచేస్తున్నాయి.

ప్రత్యేకంగా చెప్పుకోదగ్గవి డా.యం.పి.ఆర్. (డా.యం.పట్టాభిరామిరెడ్డి) గారి రెండు వ్యాసాలు. ఒకటి థామస్ మన్రో గురించీ- మరొకటి '1846 నాటి రాయలసీమ రైతాంగ తిరుగుబాటు గురించి'

ఈనాడు సీమ రచయితలు సీమ పరిస్థితులను కేంద్ర బిందువుగా తీసుకొని మంచి కథలు రాస్తున్నారు. పూర్వం కె. సభా, మధురాంతకం రాజారాం రచనలు మాత్రమే కనబడ్తుండేవి. ఈనాడు గణనీయమైన సంఖ్యలో కథకులు, రచయితలు రాయలసీమ జీవితాన్ని అక్షరబద్ధం చేస్తున్నారు. గతంలో విద్వాన్ విశ్వం రాసిన 'పెన్నేటి పాట'పై భూమన్ రాసిన వ్యాసం, ఆ పుస్తకానికి అప్పట్లో రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు రాసిన పీఠిక, ఇటీవల పి. రామకృష్ణారెడ్డి రాసిన 'పెన్నేటి కతలు 'పై భూమన్ సమీక్ష ఈ సంపుటిలో వున్నాయి.

మొత్తం క్రౌన్ సైజులో దాదాపు 250 పేజీలున్న ఈ ప్రత్యేక సంచిక వెల 40 రూపాయలు. ఇది రాయలసీమ సమస్యల గురించి అర్థం చేసుకోవాలనుకునే వారికి ఒక ఎన్‌సైక్లో పీడియా లాంటిది.

---

తర తరాల రాయల సీమ - 'కదలిక' పత్రిక కరువు సమస్యల ప్రత్యేక సంచిక - సంపాదకుడు యస్.ఇమామ్
పేజీలు : 232 వెల రు. 40/-
ప్రతులకు : డిమోక్రటివ్ యూత్ ఫోరమ్, క్రియేటివ్ ప్రింటర్స్ & అడ్వర్‌టైజర్స్, కమలానగర్, అనంతపురం.

గొంగడి పురుగు కట్టింగు మీసాల వాడు
గంపశ్రాద్ధపు దంకట్టు వాడు
ఎపుడు కాఫీ దుకాణపు రేవిణీవాడు
సిగరు కాలుప్పు బుగ బుగలవాడు
పైపటారమును లోపల లొటారమువాడు
పట్టు దప్పిన ఛలో భాయిగాడు
తుద మొదల్ లేని గాడిద గత్తరలవాడు
జలసాలతో బిక చచ్చువాడు
తడియనెడి దున్నచో జేత తుడుము మొదలు
దేవతార్చన వటొక్క తీరువాడు
వలను పడకున్న జీబుకువంటవాడు
త్రోవ దొరికినట్టి గంధోళిగాడు

మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి

(శృంగార చాటువులు పు: 49, 50)

---

జనసాహితి నిర్వహణలో నెలనెలా వెలువడే

## 'ప్ర జా సా హి తి'

మాస పత్రికను

చదవండి! చదివించండి !! చందాలు కట్టండి !!

మీ వూరు పత్రికల ఏజెంటును ప్రజాసాహితి పత్రికను తెప్పించమని అడగండి.

1991, 1992 సం॥రాల సంచికల బైండ్లు కావలసినవారు రు. 50+10 పోస్టేజీతో MO చేసి ఈ క్రింది చిరునామాకి పంపి తెప్పించుకోగలరు.

కొత్తపల్లి రవిబాబు,
సంపాదకుడు
ప్రజాసాహితి
నగరం - 522268
గుంటూరుజిల్లా

* శిక్షణా శిబిరాలు - ప్రదర్శనలు :

— ఆగస్టు 6, 7, 8 తేదీలలో విశాఖపట్నంశాఖ అరుణోదయ కళాకారులకు కా॥ దివికుమార్, కా॥ ఉదయ్‌లు శిక్షకులుగా "రామజన్మభూమి కాదురో" వీధినాటకం నేర్పారు. 8 మంది కళాకారులు ఆ శిబిరంలో పాల్గొన్నారు.

— ఆగస్టు 9. 10, 11 తేదీలలో కర్నూల్‌జిల్లా దొల్లవరం అరుణోదయ కళాకారులకు "నంద్యాల నుండి పాణ్యం" వీధి నాటిక శిక్షణా శిబిరం నిర్వహించడం జరిగింది. కా॥ బాబూరావు, కా॥ ఉదయ్‌లు శిక్షకులుగా హాజరయ్యారు.

★ సాయుధ భూస్వామ్య ముఠాల వ్యతిరేక ర్యాలీలో :

రాయలసీమలో చెలరేగుతున్న సాయుధ భూస్వామ్య గూండా రాజ్యానికి వ్యతిరేకంగా హైదరాబాద్‌లో తేది 12-8-93 న భాగ్ లింగంపల్లి పార్క్‌నుండి అసెంబ్లీ వరకు సాగిన ప్రజా ప్రదర్శన అగ్రభాగాన అరుణోదయ కళాకారులు కాంగీ ఎం. ఎల్. ఏల వేషధారణలో ఆయుధాలు పుచ్చుకొని స్వైర విహారం చేస్తున్నట్లు అభినయాలతో సాగారు. ఊరేగింపు సాగిన రహదారి పొడవునా ప్రజలు హర్షాతిరేకాలు వ్యక్తం చేశారు. స్పీకర్‌కు మెమొరాండం ఇవ్వటానికి నాయకత్వం వెళ్ళగా జలదృశ్యం వద్ద నిలిపివేయబడిన ర్యాలి ప్రజలు సిటీ ప్రజలు ముందు అరుణోదయ కర్నూలుజిల్లా కళాకారులచే "నంద్యాల నుండి పాణ్యం"వీధి నాటికను ప్రదర్శించారు.

★ పుట్టపర్తి ఘోరాలుపై సదస్సులో ఖమ్మంజిల్లా :

ఆగస్టు 14 న ఖమ్మం పట్టణంలో రిక్కా బజారు హైస్కూల్ ఆవరణలో హేతువాద సంఘం, అరుణోదయ, పి. డి. యస్. యు, పి. ఓ. డబ్ల్యు తదితర. ప్రజాసంఘాల ఆధ్వర్యంలో పుట్టపర్తి ఘోరాలపై సదస్సు జరిగింది.

అరుణోదయ - విజయవాడ బృందం ఈ సదస్సు గురించి ప్రచారం చేస్తూ ఖమ్మం బస్‌స్టాండ్‌లోనూ, రైల్వేస్టేషన్‌ల దగ్గర గల షాపింగ్ సెంటర్‌లోనూ పాటలు పాడి దళ ప్రకారం చేశారు. బస్‌స్టాండ్ వద్ద "హత్యాబాబాయ్" (వీధి నాటకం) పూర్తిగాను, రైల్వేస్టేషన్‌వద్ద నాటకంలోని కొంత భాగాన్ని ప్రదర్శించారు. సదస్సులోనూ, ఆ తర్వాత జరిగిన బహిరంగసభలోనూ అరుణోదయ రాష్ట్ర అధ్యక్షులు కా॥ దివికుమార్ ఉపన్యసించారు. పుట్టపర్తి సత్యసాయిబాబా దేముడుగానీ, భగవత్స్వరూపుడుగానీ కాదని వివిధ ప్రజా సంఘాలలోని కార్యకర్తలమైన మనం అందరికీ తెలిసిన విషయమే. అయినా, జూన్ ఆరునాటి సంఘటనతో సామాన్య ప్రజలకు కూడా బాబా కూడా (భయం, పారిపోవటాలు, తనను రక్షించు

కోవడానికి గదిలో దూరి గడియ పెట్టుకోవడాలు, పోలీసులొచ్చి కాపాడడాన్ని బట్టి) అతను కూడా అతి మామూలు మనిషేనని అర్థం అయ్యిందని దివికుమార్ అన్నారు. పుట్టపర్తిలో సంబంధించిన మరణాలు హత్యలేనని, ఎన్‌కౌంటర్ల పేరిట అనేక మందిని చంపేస్తూ అల్లే కట్టు కథల్లాగే పుట్టపర్తిలో జరిగిన పోలీసుల హత్యలపై కూడా అల్లుతారనీ, బాబాను కనీసం విచారించకుండా ఈ ఘటనలను మాఫీ చేయడాన్కి, తద్వారా బాబా యొక్క మహాత్మ్యాలను కాపాడాన్కి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిరంతరం కృషిచేస్తున్నాయని విమర్శించారు. జూన్ ఆరునాటి ఘటనలేకాక, అంతకు ముందు జరిగి, మాఫీ చేయబడిన ఘటనలను కూడా వెలికి తీసి పూర్తిగా విచారణ చేయించాలని, దివి కుమార్ డిమాండ్ చేశారు. ఖమ్మం పట్టణం అంతా సాగిన ఊరేగింపు అగ్రభాగాన అరుణోదయ, విజయవాడ బృందం కళాకారులు సత్యసాయి, ఆయనకు పాదాభివందనాలు చేసే ప్రభుత వేషాలతో పాల్గొన్నారు. ఆ వేషాలు ప్రజల్ని బాగా ఆకర్షించాయి.

★ ఒంగోలులో బాబాల స్వాముల బండారంపై బహిరంగసభ ;

28 వ తేదీన ఒంగోలు, మహిళా మండలిలో అరుణోదయ, జనసాహితి, హేతువాద సంఘం ఆధ్వర్యంలో బాబాల, స్వాముల బండారంపై బహిరంగసభ జరిగింది ఆ సభలో అరుణోదయ రాష్ట్ర అధ్యక్షులు దివికుమార్ ఉపన్యసించారు. అరుణోదయ విజయవాడ బృందం "హత్య బాబోయ్" ప్రదర్శించింది.

★ జలంధర్ (పంజాబ్) డంకెల్ వ్యతిరేక అఖిల భారత రైతాంగ సదస్సులో జనసాహితి, అరుణోదయ :

దేశవ్యాపితంగా ఏడు రైతు కూలీ సంఘాల నేతృత్వంలో డంకెల్ ప్రతిపాదనలకు వ్యతిరేకంగా అఖిల భారత స్థాయిలో అగస్టు 17, 18 తేదీలలో పంజాబ్ రాష్ట్రంలోని జలంధర్ సిటీలో, దేశ్ భగత్ యాద్‌గార్ హాల్‌లో ఒక రైతాంగ సదస్సు జరిగింది. ఆ సదస్సులో ఆంధ్రప్రదేశ్, పంజాబ్, ఒరిస్సా, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌ల నుండి వచ్చిన కళాకారులు "అరుణ పతాకమూ.... చేగొనుమా రెడ్ శాల్యూట్" అనే పాటతో, డంకెల్‌కు వ్యతిరేకంగా అనేక పాటలు పాడారు. పంజాబీ, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్, మహారాష్ట్ర కళాకారులు విప్లవ గీతాలు పాడారు.

మొదటి రోజు రాత్రి అరుణోదయ విజయవాడ దళం "కర్జ్‌కా భారత్" ("అప్పుల భారతం" వీధి భాగవత యక్షగానాన్ని)ని హిందీలో ప్రదర్శించారు. ఆ సదస్సు విజయవంతం కావాలని ఆకాంక్షిస్తూ అరుణోదయ రాష్ట్ర అధ్యక్షుడు కా॥దివికుమార్, జనసాహితి రాష్ట్ర నాయకుడు కా॥ నిర్మలానంద సందేశాలిచ్చారు మూడవ ప్రపంచ దేశాల పాలిటి ఉరితాడుగా రూపొందించిన ఈడంకెల్

ప్రతిపాదనలకు వ్యతిరేకంగా అనేక విప్లవ రైతాంగ పోరాటాలు, వందలాది విప్లవవీరులు జన్మించిన పంజాబ్ గడ్డపై, ఆ అమరవీరుల స్మృతి చిహ్నంగా నిర్మింపబడ్డ దేశభగత్ యాద్‌గార్ హాల్‌తో జరగటం భవిష్యత్ పోరాటాలకు మంచి మలుపుగా రూపొందగలదన్న ఆశాభావాన్ని వీరు తమ సందేశాల్లో వ్యక్తం చేశారు. బలమైన కార్మిక కర్షక పోరాటాల ద్వారా ఈ సామ్రాజ్యవాదులను, డంకెల్ ప్రతిపాదనలను ఓడించి వేలాది మృతవీరులు మనపై విడిచి వెళ్ళిన బాధ్యతాయుత కర్తవ్యాన్ని నెరవేర్చడానికి ఈ సదస్సు గొప్ప ఉత్తేజాన్నివ్వాలని రచయితలుగా, కళాకారులుగా కోరుకుంటున్నామని అన్నారు.

★ జలియన్ వాలాబాగ్, హుస్సేన్‌వాలా అమరవీరులకు శ్రద్ధాంజలి :

పంజాబ్ వెళ్ళిన సందర్భంగా సట్లెజ్ నది తీరాన గల హుస్సేన్‌వాలాలో నిర్మింపబడిన భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల స్మారక చిహ్నాలను (మార్చి 23, 1931 న ఉరితీసి, జైలు వెనుకగోడను బద్దలుకొట్టి, బ్రిటిష్ ముష్కరులు దొంగ చాటుగా శవాలు తీసుకెళ్ళి తగులబెట్టిన ప్రదేశం) కా బటుకేశ్వర దత్, విద్యావతిదేవిగార్ల స్మారక చిహ్నాలకు కా నిర్మలానంద తదితరులు సందర్శించి, ఆ అమరులకు శ్రద్ధాంజలి ఘటించారు. అలాగే 19 వ తేదీన అమృతసర్ లోని జలియన్ వాలా బాగ్ దురంతం జరిగిన ప్రదేశానికి వెళ్ళి అమరవీరుల స్తూపంవద్ద సంస్మరణ సభ జరిపారు. కా॥ దివికుమార్, కా॥ నిర్మలానంద, కా॥ ఉదయ్‌లు ప్రసంగించారు. వివిధ భాషల కళాకారులు అమరవీరులపై విప్లవ గీతాలు పాడారు.

★ ప్రకాశంజిల్లా టంగుటూరులో డంకెల్ వ్యతిరేక సభలో :

30 ఆగస్టు 1993 వ టంగుటూర్‌లో కొండపి రోడ్‌లో - ఆం. ప్ర. రైతు కూలీ సంఘం, PDSU, AIFTU లు నిర్వహించిన డంకెల్ వ్యతిరేక బహిరంగసభలో పలుకూరు, ఉప్పుగుండూరు కళాకారులతోపాటుగా విజయవాడ అరుణోదయ కళాకారులు కూడా అనేక పాటలు పాడారు. 'అప్పుల భారతం' 'హత్య బాబోయ్' ప్రదర్శించారు. సభకు ముందుగా రూపాయి, డంకేల్, పి. వి. వేషాలతో దళ ప్రచారం జరిగింది.

---

Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.). at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.
Working Editor : NIRMALANANDA